# అప్పయమంత్రి

మునిమాణిక్యం

Publishers :
**MUNIMANIKYAMS**
**MUSLIPATAM.**

వెల: ఒక రూపాయి.

# అన్వయ మంత్రి

న. శ్రీసింహాద్రి, ముని మాణిక్యం

ముని మాణిక్యం

Publishers :
**MUNIMANIKYAMS**
MASULIPATAM

# 1

కటకపురమునుండి కళింగపట్టణమునకు రావలయు నన్న దుర్గమారణ్య మార్గముననే రావలయును గాని మరొక దారి లేదు.

అరణ్యములోనుండి ఆ కురువ పాముమెలికలు తిరుగుచు గుట్టలకెక్కి పల్లపు భూములలోనికి దిగును. దారికిరు ప్రక్కలను ముండ్ల పొదలున్నవి. ఆ పొదల కావల మహా వృక్షము లున్నవి, రకరకముల పూలతీవలు ఆ చెట్లను అల్లి బిల్లిగ నల్లుకొని యున్నవి.

ఆ భూరుహములపై వివిధములగు విహంగములు కిలకిల మనుచు ఎగురుచుండెను. ఉల్లంకి పిట్ట గడ్డి పిట్ట కుంకుమలపుగాను, చల్లపిట్ట, చాకిశావ మొదలగు చిన్న పిట్టలు కిలకిల మనుచు, కిచకిచమనుచు ఈ చెట్టునుండి ఆ చెట్టునకు ఆచెట్టునుండి యీ చెట్టునకు ఎగురుచుండెను. ఒక వేపచెట్టుపై పొన్నంగి యొకటి పొంకముగ కూర్చుండి గువ్వ పిట్టతో గుస గుస లాడుచుండెను. బంగరు పిచ్చుకల కిచకిచలతో ఆ ప్రదేశము నిండి పోయెను. వల్లచ్చిగాడు తుఱ్ఱుతుఱ్ఱున ఎగురుచుండెను. ఆ అడవిలో చిలుకలకును గోరువంకలకును కొదువలేదు.

ఆ కొండ దారిని రెండెడ్లబండి యొకటి నడచుచుండెను. బండివాడు ఎద్దులను మాటి మాటికి అదలించుచు

తొందర పెట్టుచుండెను. సాయుధ పాణులైన నలుగురు మనుష్యులా బండి వెంట వచ్చుచుండిరి.

ఆ నలుగురిలో ముదుసలియైనవాడు, బవిరి గడ్డము వాడు, దీర్ఘకాయుడొకడు శకటమును సమీపించి, వెనుక భాగముననున్న తెరను తొలగించి, లోనున్న వ్యక్తిని ఉద్దేశించి "అమ్మా! కళింగ పురమింకను రెండు పరుగుల దూరములోనున్నది. ప్రదోష కాలమునకు మనము పట్టణమును ప్రవేశింపగలుగుదుము. నీ కేమియును భయములేదు తల్లీ. నీ వెందులకు వెత నొందెదవు. నీకు రాగల ఆపద ఏమియును లేదు" అని కుస్తరించుచుండెను

బండిలో కూర్చుండిన ఒప్పులాడి యొకర్తుక ఈ మాటలు విని సంతోషించి, పెదవులపై చిరునవ్వొకటి వెలయించి "తండ్రీ! మీరు నన్ను కంటికి రెప్పవలె కాపాడినారు అంతల పొంతలవారు ఎందరుండిన నేమి లాభము. ఆపద సమయమున భగవంతునివలె అక్కరకు వచ్చినావు. నీ మేలుం మఱువను ఎల్లైనను నీవు నన్ను సురక్షితమైన స్థలమునకు చేర్చితివా, నీ కడుపునబుట్టి నీ ఋణము తీర్చుకొందును" అనెను.

ఆ వృద్ధుడు మీసలు దువ్వి "తల్లీ! నేనుండ నీ కెట్టి ఆపదను రానీయను. కళింగ ప్రభువు సన్నిధికి నిన్ను తీసికొనిపోయి వారికి నిన్ను ఒప్పజెప్పిగాని నేను తిరుగు ముఖము పెట్టను" అని ఆ సుకుమారికి ధైర్యము చెప్పెను.

ఆ వన్నెలాఁడియు మిగుల సంతసించెను. అంతట నాతఁడు వెనుకకుతగ్గి బండి వాని ఎద్దులను వేగముగ నడిపింపుమని తొందర పెట్టసాగెను. ఆ నృపలి యోధునకు శత్రువుల వలని ఆపద గలుగునని జంకులేదుగాని ఆ యడవిలో భయంకరములైన క్రూర మృగములున్నవి. ప్రొద్దు గ్రుంకినంతనే అవి బయటకు వచ్చును. అవి ఎక్కడ వచ్చి పడునో యని యాతఁడు కొతుకు పడుచుండెను.

# 2

ప్రొద్దు గ్రుంకు సమయమైనది. పక్షులు కిలకిలారవములతో ఆ యడవియంతయు మారుమ్రోగుచుండెను. దూరమున ఎక్కడో మువ్వన్నె పులి యొకటి గాండ్రుమనెను. మన ప్రయాణికుల హృదయములలో ఆ గాండ్రింపు ప్రతిధ్వనించెను. వారు తిక్కట మక్కట పడసాగిరి.

బండిలోనున్న యువతి మాటిమాటికి తెరను తొలఁగించి బయటికి తొంగి చూచుచుండెను. ఆమె సంగతి ఇక్కడ కొంచెము చెప్పవలయును. ఆమె పేరు మధురభాషిణి.

ఆమె తండ్రి ఒడ్డెరాజులవద్ద చాలకాలము పనిచేసి సంవత్సరము క్రిందట మరణించినాఁడు. ఆయనకు నాట్యమునందు మిక్కుటమైన ప్రీతి. తన కుమార్తె నాట్యశాస్త్రమభ్యసింప వలయుననియు తత్ శాస్త్రమునందు అద్వితీయ ప్రతిభను సంపాదింప వలయుననియు ఆతని యభీష్టమైయుండెను. అందుచే అతఁడామెకు సంగీతమును, నాట్యమును చెప్పించెను, కాని ఆమె ప్రతిభా ప్రదర్శనము చూచుటకాయన నోచుకొనలేదు. కుమార్తె పదునేడు సంవత్సరముల వయస్సు కలదై యున్నపుడు అతఁడు అపమృత్యువువాతఁబడి పరలోకమున కేగినాఁడు. తల్లియే మధురభాషిణిని పెంచి పెద్ద చేసినది. భర్త అభీష్టమును నెరవేర్చు నుద్దేశముతో

# 5

ఆమె కూతునకు నాట్య విద్యయందు సంపూర్ణ పాండిత్యము నలవడఁజేసెను.

అప్పటికి వీరభద్ర గజపతి కటక రాజ్యమునకు ప్రభువై నాఁడు. అతఁడు చిన్న వాఁడు. దుందుడుకు స్వభావము కలవాఁడు. మధురభాషిణి నాట్యము చేయగలదనివిని ఆమెను తన సమక్షమున నాట్యవిద్యా ప్రదర్శనము చేయవలసినదిగా ఆజ్ఞాపించెను. మధుర భాషిణికి అతని ఎదుటఁబడుటకు ఇష్టము లేదు. కాని ప్రభునాజ్ఞ తిరస్కరించినచో ఆపద రాఁగలదని గ్రహించి తల్లి మధురభాషిణిని ఒప్పించి రాచనగరునకు పంపినది.

ఆరోజున సభా మందిరము కళాభిమానులతోఁ గిక్కిరిసి పోయినది. పండితులు గాయకులు ఎందరో వచ్చినారు. స్త్రీలతోడను పురుషులతోడను సభ కలకల లాడినది.

వీరందఱి ఎదుటను మధురభాషిణి ఆ నాఁడు మనోజ్ఞముగ నాట్యముచేసినది. ఆమె ఒయ్యారము లొలుకఁ బోసినది. వివిధ నాట్యభంగిమములు ప్రదర్శించినది. ప్రభువు సంతోషించినాఁడు.

కాని ఆమె కులుకు చూచి వీరభద్రగజపతి ఆమెను మోహించినాఁడు. ఆమెను తన వశముచేసికొన నిశ్చయించి ఆసంగతి ఆమెతో ప్రస్తావించెను. కాని మధురభాషిణి నీచపు పనుల కొడంబడుట కియ్యకొనలేదు. రాజు ఆమెను బలాత్కరింప సమకట్టెను. ఆ సంగతి తెలిసి ఆమె కటకమును విడిచి

పాఱిపోయివచ్చినది. కళింగప్రభువు శరణుజొచ్చి, ఆయన రక్షణలో నుండిపోవలయునని గంపెడాశతో నామె బయలు దేరి వచ్చినది.

రాజసేవకులు తన వెంటఁ బడుదురని ఆమె అనుకొనకపోలేదు. అందుచేతనే ఆమె అడలిపోవుచున్నది. తన జనకుని మిత్రులు నల్గురామెను ఓఢ్రరాజ్యపు సరిహద్దులను దాటించి, కళింగ పట్టణమునఁ జేర్చుటకు వెంటవచ్చినారు. ఈ నలుగురును తనను శత్రువులనుండి రక్షింపఁగలరాయను సంకోచము ఆమెకు లేక పోలేదు. కాని ఒడ్డె సైనికులు రాక ముందే కళింగ పట్టణము చేరఁగలుగుదుమని ఆశమాత్ర ముండెను. చీఁకట్లు క్రమ్ముకొనఁగా ఆమెకు అలమట హెచ్చ సాగెను.

ఇంతలో బండివాఁడు "అమ్మో పాము" అని పెద్ద కేక పెట్టినాడు. ఆమె అంగరక్షకులు, బండి వెనుక కొంత దూరమున నున్న వారు, పరుగెత్తుకొనివచ్చిరి. ఆ సర్పరాజము నడిత్రోవలో నొకింత సేపు తళతళలాడి ఇంతలో తటిత్తువలె అదృశ్యమైనది. పికిలిపిట్ట యొకఁడు దారికడ్డముగ పాఱెను. దివాంధ మొకఁడు కూసెను. ఈ దుశ్శకునముల జూచి మధురభాషిణి గజగజ లాడిపోయెను.

అప్పుడా యనుచరులలో ఒక్కరి యొకఁడు ముందునకువచ్చి మఱియొకసారి ఆయువతికి ధైర్యము చెప్పి, బండివానితో ఎద్దుల వదలింపుమని హెచ్చరించి వెనుకకు తగ్గెను.

## 7

ఇంతలో కటకము వైపునుండి గుఱ్ఱపు డెక్కల చప్పుడు వినవచ్చెను. బండియందున్న ఆఁడుబిడ్డ భయవిహ్వల యయ్యెను. వృద్ధయోధుఁడు శత్రువులవలన ఆపదను శంకించి ఎద్దుబండిని దారి తప్పించి వేఱొకమార్గమును పట్టించెను.

ఆమార్గము అంత సుఖమైనది కాకపోవుటచే వారు చాల కష్టపడవలసి వచ్చెను. వారు అతలా కుశలము అయి ఎట్టులో కళింగ పట్టణము చేరఁగలిగినారు, ఎంత సంకటపడినను ఎట్లో బ్రతికి బయట పడినందులకు మధురభాషిణియు ఆమె అనుచరులును సంతోషపడినారు.

ఆరాత్రియే మధురభాషిణి రాజదర్శనము చేసి తన వృత్తాంతమునంతయు అరమరిక లేక ప్రభువునకు విన్నవించెను ఆ మన్నీఁడు మధురభాషిణి పలుకులాలకించి జాలినొంది ఒడ్డెరాజుల క్రౌర్యమునుండి ఆకన్నియను రక్షించుటకు అంగీకరించెను.

# 3

మరునాడు కళింగాధీశుఁడు సింహాసనారూఢుఁడై నిండు పేరోలగంబందుండ ప్రతీహారి యొకఁడు చరచర వచ్చి ఉత్కళ ప్రభువు పంపిన రాయబారి అన్నయామాత్యుఁడు రాజదర్శనమునకై వచ్చియున్నాఁడని తన ప్రభువునకెఱింగించెను. రఘుదేవ రాయలు వెంటనే యాతని లోన ప్రవేశపెట్టుమని యాజ్ఞ నొసంగెను. ప్రతీహారి తల వంచి మ్రొక్కి బయటికేఁగి అన్నయను తీసికొనివచ్చి ఉచితాసనమును చూపెను.

రఘుదేవరాయలు ఆ ఆగంతకుని క్షేమమడిగి వచ్చిన పని తెలియఁజేయుమని కోరెను. అన్నయ లేచి నిలువఁబడి సగౌరవముగ నిట్లనియెను.

"ప్రభూ. మధురభాషిణి యనునామె నిన్న మునిమాపువేళ మీకడకు వచ్చి, మీ శరణుఁజొచ్చినదని వింటిని. ఆమె కటకమునుండి అరుదెంచినది. ఆమె రాజద్రోహి. గజపతి మహారాజులుంగారు ఆయువతిపై మోహించి తన రాజప్రాసాదమును ప్రవేశింపుమని కోరఁగా ఆమె వారి ఆజ్ఞను తిరస్కరించి అటనుండి పాఱిపోయి వచ్చినది. ఆ యందకత్తియకు రక్షణము నీయఁదగదు. ఇచ్చినచో మీరు గజపతి ఆగ్రహమునకు గుఱి కావలసి వచ్చును వెంటనే ఆమెను

కటకమునకు పంపివేయుట ఎంతయు నుచితము. వీరభద్రుఁడు యువకుడు ఉడుకురక్తముకలవాఁడు. తొందరపాటుకలవాఁడు. అతనితో మీకు విరోధమెందులకు! నా హితోక్తులు ఆలకింపుఁడు. ఆమెను నా కైవసము చేయుఁడు. అట్లు చేసినచో నిరుగు పొరుగుననున్న ఈ రెండు రాజ్యములును చిరకాలము స్నేహముతో వర్ధిల్లఁగలవు.

సభయందున్న వారెల్ల ఈ పలుకులు విని డిల్లపడిరి. వారికీయుదంతమే తెలియదు. ప్రభువునకు మాత్రమిది ఇట్లు జరుగునని తెలియును. ఏమైనను సరియే మధురభాషిణిని ఆ యన్నకారికి నప్పఁజెప్పగూడదని యాతఁడిదివరకే నిశ్చయించుకొనెను.

అట్లు నిశ్చయించుకొనుటకు తగినంత కారణము లేకపోలేదు.

మొదటి సంగతి శరణాగతులను రక్షించుట ప్రభువైన తనకు విధి గదా! అదియునుగాక ఆమె అసలు కళింగ దేశపు స్త్రీ. ఆమె తండ్రి ఉత్కళ రాజధానిలో ఉద్యోగము చేయుటకు వెళ్లియుండెను. ఆమె తన కొక దూరపు బంధువు కూడను. ఆమెను కాదని శత్రువులకు ఎట్లొప్పగింపఁగలఁడు. ఆయనకేటు చెప్పుటకును తోఁపక తన మంత్రియైన గన్నయామాత్యుని వంక సాభిప్రాయముగఁ జూచెను.

గన్నయ రాజకార్య నిర్వహణయందు నిపుణుఁడు. న్యాయబుద్ధి కలవాఁడు, ధర్మమునం దనురక్తుఁడు, మధుర

భాషిణిని శత్రువశము చేయుటకాతనికి మనసొప్పలేదు. ఎట్టి యాపదయైనను రానిమ్ము దీనురాలిని రక్షించుటయే రాజధర మని గన్నయామాత్యుఁడు గట్టిగా విశ్వసించెను.

గన్నయామాత్యుఁడు లేచి అన్నయ దిక్కై- "అమాత్యశేఖర ! మధురభాషిణి ఎవ్వరనుకొంటివి ! ఆమె వేశ్యయని తలంచితివా ? ఆమె రాజబంధువు. ఆమెను కామించుట మీ రాజునకు తగదు. ఆతఁడు చిన్నతనముచే నొకవేళ తొందరపడినను పెద్దవాఁడవు, ధర్మజ్ఞుఁడవైన నీవు ప్రభువున కుచితానుచితముల నెఱిఁగించి యీ దుష్కార్యము నుండి వారింప వలసినదిపోయి ఈ విషయమున వారికి తోడ్పడుట ధర్మముకాదు. ఆమెను వదలిపొమ్ము. నీ ప్రభువునకు హితవు బోధింపుము" అనెను.

ఇట్లు మంచి మాటలతో ఆతనిని పంపివేయవలయునని గన్నయ ప్రయత్నించెను. ఎన్నియో విధముల చెప్పి చూచెను. కాని అన్నయ పట్టుబట్టి యామెను తనకైవసము చేసి తీరవలసినదే యనియు లేకున్న వైరము తప్పదనియు కచ్చితముగఁ జెప్పెను.

గన్నయ యప్పట్టున కోపవశుఁడయ్యెను. అన్నయను నమిలి మ్రింగవలయునన్నంత కోపము వచ్చెను. కాని రాయబారిని అవమానించుట యధర్మముకావున అప్పటికి తన యాగ్రహమును అదుపులో పెట్టుకొని యా ముష్కరునకు తగినరీతిని బుద్ధిచెప్ప వలయునని నిశ్చయించుకొనెను.

గన్నయ విచారమును అభినయించి అన్నయతో- "సరియే మీరు కోరినట్లే రేపు ఉదయముననే మధురభాషిణిని మీతో పంపివేయుదుము, అంతదనుక ఓపిక పట్టుఁడు" అనెను.

అన్నయ్య మీసములు సవరించుకొని జయోత్సాహముతో సభను వీడి విడిది కరుదెంచెను.

గన్నయ ఇట్లాడంబడుననియు రఘుదేవరాయ లెప్పుడును అనుకొనియుండలేదు. అందుచే నాతఁడబ్బురపడి, "అట్లంటివేమి ?" అని అర్థము వచ్చుచూపును చూచెను.

గన్నయ ప్రభువును జూచి సాభిప్రాయముగ నవ్వి "ప్రభూ ఈ విషయము నాకు వదలివేయుఁడు. ఈదురాత్మునకు నేను తగిన రీతిని బుద్ధిచెప్పిపంపఁగలను" అనెను.

రఘుదేవరాయలకు గన్నయ రాజకీయ తంత్రజ్ఞుఁడని తెలియును;

అతని యెడల ప్రత్యయమును ఆతనిసామర్థ్యమునందు విశ్వాసమును కలవాఁడు కావున మాఱుమాటాడక చిరునగవు నవ్వి సభ చాలించి వెడలిపోయెను.

సభికులు గన్నయయెట్టి పన్నాగముపన్ని యుత్కళరాయబారిని, పంపివేయఁగలఁడాయని తత్తఱపాటు పొందసాగిరి.

తెల్లవారక మునుపే అన్నయ ప్రయాణమునకు సంసిద్ధుడయ్యెను. బండ్లు కట్టించెను. అందు పట్టు పరుపులను దిండ్లను అమర్చిరి. అంతయు సిద్ధమయ్యెను. కాని మధుర భాషిణిరాలేదు. గన్నయ యామెను తన వశముచేయలేదు. ఆమెకొఱకే అన్నయ యెదురు చూచుచుండెను.

మధుర భాషిణి యెంత సేపటికిని రాకుండుటవలన అన్నయ చిడిముడిపడి తన యెదుటనేయున్న గన్నయతో "ఏమయ్యా. మధురభాషిణిని పంపలేదేమి? ఆమె యెప్పుడు వచ్చును? ఎంతకాలమామె కొఱకై నేను వేచియుండ వల యును! ఇప్పుడైనను తొందరగా తీసికొనిరమ్ము" అనెను.

గన్నయ్య చేతులు కట్టుకొనినిలువబడి, 'స్వామీ, ఆమె వచ్చుచుండవలయును. ఈ పాటికి బండి ఎక్కి ఉండ వచ్చును" అని సవినయముగా జవాబు చెప్పెను.

అన్నయ ప్రయాణమును జూచుటకు ప్రజలందరు నచట గుమికూడి యుండిరి. ఏమిచిత్రము జరుగునో చూత మని వారు తహతహ లాడజొచ్చిరి

గన్నయ ఆజ్ఞలను అనుసరించి సేవకులొకరి వెనుక నొకరు మధురభాషిణికై పరుగెత్తుచుండిరి. గన్నయ మధ్యమధ్య మిథ్యాకోపమును ప్రదర్శించుచు "ఏమిరా, మధురభాషిణి ఇంకను రాకుండుటకు కారణమేమి? అవతల అన్నయగారు వేచియున్నారని ఆమెకు తెలియదా! పెద్దమను ష్యులు వారు ఎంత సేపని కాలుగాలిన పిల్లివలె అటునిటు

తిరుగఁగలగు! వెంటనే పరుగెత్తుకొనిపోయి ఆమెగారిని ఇక్కడ ఉన్నట్లు తీసికొనిరా, పోరా," అనును

మఱికొంత సేపు ఉండి ఇంకొక సేవకునితో, "అదేమిరా! ఆమె సింగారమింకను పూర్తి కాలేదా యేమి? ఏమి చేయుచున్నట్లు! ఆ పోయినవాఁడు అదే పోకపోయినాఁడేమి? నీవైనను సత్వరమున నామెనుకొనిరమ్ము." అని మఱియొకనిని కసరి తఱుమును.

ఈ నయగారపు మాటలవలన కొంత తృప్తిపడ వలసిన అవసరము అన్నయకు కలిగెను. కాని ఎంత సేపటికిని ఆజవ్వని రాకుండుటవలన నాతఁడు కక్కటపడసాగెను.

కాలము గడిచి పోవుచుండెను. ఆమెరాలేదు. ఇదిగో వచ్చును, అదిగో వచ్చును అన్నమాటేగాని రాకడ మాత్రము జరుగలేదు. గంట గడిచెను. ఆమెరా లేదు. రెండుగంటలు గడిచెను. ఇంకను ఆమెరాలేదు. మూడు గంటలు గడిచెను. అప్పటికిని ఆమె రాలేదు.

అన్నయకు కోపమతిశయించెను. అతఁడు చిందులు త్రొక్కసాగెను. అతని రవరవఁజూచి పురజనులందరును ఉత్తరీయపు టంచులను నోట గ్రుక్కుకొని నవ్వసాగిరి.

గన్నయ అన్నయను సంతోషపెట్టుటకు చేయవలసిన "హడావుడి" అంతయు చేయుచునే యుండెను. అతఁడు అటునిటు పరుగెత్తును. ఎవరినో కేకలువేయును. ఎవ్వరినో

పిలచును. ఎవ్వరును పలుకరు, ఆతడు చిటచిటలాడును. అఱచును.

మధ్య మధ్య ఆతఁడు అన్నయ్యను సమీపించి, "స్వామీ మా సేవకులు తెలివితక్కువవారు. ఏపని చెప్పినను ఇంతే. వీరితో నేను సతమత మగుచున్నాను." అని వాపోవును అటు నిటు తిరుగును. ఎవరినో ఒకరిని మధురభాషిణి కొరకు మరల పంపును. ఇట్లు మఱియొక గంట గడిచెను.

ఈలోపున అన్నయ కు, భగవంతుఁడిచ్చిన సహన శక్తి నశించినది. ఆతఁడు నిప్పును త్రొక్కిన కోఁతివలె చిందులు త్రొక్కసాగెను. అతని కంత కంతకు కోపము అతిశయింపసాగినది.

ఆతని కోపము హెచ్చిన కొలఁది గన్నయ వినయ ప్రదర్శనము కూడ హెచ్చసాగెను. గన్నయ అన్నయకు వంగి వంగి నమస్కరించును. "మఱి పదినిమిషములలో ఆమె రాఁగలదు స్వామీ!" యని యచ్చికబుచ్చికలాడుచు, తన పరిచారకులను తిట్టుచు కాలయాపన చేయసాగెను.

అన్నయ ప్రళయకాల మార్తాండుని పగిది మండి పోవుచుండెను. గన్నయ వినయ భాషణమును, కాలయాపనమును ఆతనిని మఱింత రెచ్చఁగొట్టుచుండెను. అతఁడు రేఁగుచుండెను.

ఆతఁడు చివర కిట్లనియెను. "గన్నయా, ఇంత కాలము నేను ఒక యాఁడుదానికొఱకై వేచియుండునట్లు చేయుట నాకు అవమాన కరముకాదా! ఇదియంతయు ఒక కుట్రవలెనున్నది. నన్ను కేళి సేయుటకాదా!"

అన్నయ ఇట్లు గొంతు చించుకొనుటఁజూచి ప్రజలందరును లోలోన నవ్వుకొనిరి గన్నయ మాత్రము భయమును నటించుచు క్షమాపణలపై క్షమాపణలు కురిపించుచుండెను,

నాలుగు గంటల కాలము ఈ నాటకము జరిగినది. ఈ కాలమంతయు అన్నయ యాటకోఁతి వలె గంతులిడుచునే యుండెను.

అప్పుడు గన్నయ "అదిగో మధుర భాషిణి వచ్చుచున్నది. అదిగో ఆమె బండి!" అని ఒక పెద్దకేక పెట్టెను. అందఱాదిక్కునకు చూచిరి. నాలుగు గుఱ్ఱములచే లాగబడుచున్న బండి యొకటి అతివేగమున వారున్నచోటికి వచ్చుచుండెను.

"అదిగో మధురభాషిణివచ్చుచున్నది. ఆమె నీలి చీర గట్టినది. తెల్లరవిక తొడిగినది. కాంచన భూషణముల ధరియించినది. అప్సరసవలె, అందాల భరిణెవలెనున్నది, అని తలకొక తీరున ఆమెను వర్ణింప సాగిరి.

ఇంతలో బండి యచటికివచ్చి యాఁగినది. అప్పుడు హర్షధ్వానములు మిన్నుముట్టినవి. అందరును బండి చుట్టును మూఁగిరి.

అన్నయ బండినంక నిదానించి చూచెను. దగ్గరకు వెళ్ళిచూచెను. అందెవ్వరును లేరు. కాని యందఱునందు మధురభాషిణి యున్నటులే భావించి యామెతో సంభాషింపఁ దొడఁగినారు.

"వెళ్ళిరాతల్లీ భయములేదు" అని ఒకరు. "గజపతి నిన్నేమియు బలాత్కారము సేయఁడు లేతల్లీ! ప్రభువు వారికి మంచి చెడ్డలు తెలియకుండునా!" అని మరియొకరు,

"అన్నయామాత్యులవారు నీకు తండ్రివంటివారు. వారి అనుగ్రహమున్న నీకెట్టి ఆపదయు కలుగదులే అమ్మా' అని ఇంకొకరు,

పిచ్చితల్లీ, విలపింతువేలనమ్మా! అన్నయ ఉండగ నీకేమి భయముతల్లీ!" అని మరియొకరు, అనసాగిరి.

అన్నయ ఇది అంతయు చూచినాఁడు వారిమాటలు వినినాఁడు. అతని విస్మయమునకంతులేదు.

ఇదేమి చిత్రము. వీరందరును ఎవ్వరితో మాటలాడుచున్నారు. ఏడువవలదని అందురు, అందెవ్వరు లేనిదేవేడ్చు నదిఎవరు? ఇదేమివింత! బండిలో ఎవ్వరును లేనిదే ఎవరోఉన్నట్లు వీరందరును భావించి సంబోధింతురేమి? ఇది కలయా?

మోసమా! అని అన్నయ వితర్కించుకొని. కన్నులు తుడుచుకొని పలుమారు వీక్షించి నిర్వేరపడెను.

అతడు ఆలోచించెను. "ఇంత మందికి కనిపించుచున్న మానిసి నాకేల గనిపింపదు. నేను బండిలో మానిసి లేదని అనినచో అందరును నవ్వుదురు నన్ను గేలిసేయుదురు. ఇప్పటికి ఊరకుండుటయే మేలు. నాకనుకలి కేదియో లోపము వచ్చినది." అని నిశ్చయించుకొనెను.

అన్నయకు ఇంకను సందేహము తీఱలేదు. తన యనుచరులలో వృద్ధుఁడైన వాని నమ్మకమైనవాని, నొకనిని పిలిచి "ఏమయ్యా ఆబండిలో మధురభాషిణి నీకన్నుల కగుపించుచున్నదా? యని యడిగెను.

ఆవృద్ధు డాశ్చర్యమును ప్రకటించి "కనపడకేమి మహాప్రభూ కనపడుచునేయున్నది. 'దుక్కు'లాగ కూర్చుండి యున్నది. మేలి ముసుగు ధరించినది!! అని చెప్పెను. ఆసేవకుఁడుకూడ గన్నయ పెట్టిన లంచమును తినినవాడే! అందు వలననే యాతఁడట్లు మాటాడినాడు.

'అన్నయకప్పటికి ఇదేదియో కనికట్టుఅని దృఢ నమ్మకముకలిగినది. అతడాబండిలో మధురభాషిణి యున్నదని నమ్మినట్లు నటించి ఇఁక బండ్లు సాగనిమ్మని ఆజ్ఞయిచ్చెను.

అప్పుడు గన్నయ, అన్నయను సమీపించి, "బాబా అన్నయగారూ, మధుర భాషిణిని మీచేతిలో పెట్టితిమి మీ అనుగ్రహమును సంపాదించుటకే మేమిట్లుచేసితిమి.

ఆమెను రక్షించు భారముమీదే? గజపతి పిన్న వయస్సులోనున్నవాఁడు. అన్నము పున్నము నెఱుఁగని వాఁడు. మీరు పెద్దలుకదా! శ్రీవారికి చెప్పవలసిన రీతిని చెప్పి, మామధురభాషిణికి ఎట్టియాపదయును రాకుండ కాపాడ వలయును ఆమెను మీ నిజపుత్రికగా భావింపుఁడు" అని వేడుకొనెను. అన్నయ మందస్మిత వదనుఁడై అటునిటు చెప్పక ఊరకుండెను.

తరువాత గన్నయ శకటమును సమీపించి, "సుందరీ, మధురభాషిణీ, అన్నయామాత్యులు నాప్రార్థన నంగీకరించినారు. నీకేమియుభయములేదమ్మా! పోయిరమ్మ అని గద్గద స్వరముతో పలికెను.

అచటి పెద్దలందరును. "తల్లీ మేముందుము. సుఖముగా వెళ్ళిరాతల్లీ అన్నయ నీకెట్టి ఆపదయు రానీయఁడు లేవమ్మా! ధైర్యముగ నుండుము." అని రకరకములుగా ప్రీతి వాక్యములను పలికిరి.

అన్నయ తనకు జయముకలిగినదని భావించుచున్నట్లు నటించి గర్వముతో నటు నిటుచూచి, గుఱ్ఱముల తోలుఁడని యాజ్ఞాపించెను.

అందఱును విషాద వదనములతో బండికిరుప్రక్క లను బారులు తీరి నిలువఁబడిరి. అందొకఁడు ముందునకువచ్చి, "అన్నయగారూ మధురభాషిణిని జాగ్రత్తగా తీసికొనిపొండు. మధ్య ఎచ్చటనైనను బండ్లను ఆపి ఆమెకు దప్పితీర్చుకొన

కలసిన అవసరము కలిగినదేమో విచారింపుఁడు," అనిహితవు చెప్పెను.

ఇంతలో బండ్లు సాగినవి. ముందు మంత్రిగారి బండి. దాని వెనుకనే మధురభాషిణి అరదముండెను. ఆతరువాత నలుగురు సేవకులెక్కిన తేరును ఉండెను.

గుఱ్ఱములదలింపఁబడినవి. చూచుచుండఁగనే అంక పొంకాలమీద అవి యతివేగముగ పరుగెత్తినవి. బండ్లు కనుమరుగు కాఁగనే పురజనులందఱును ఒక్కసారి పకాలున నవ్వినారు. దుర్మార్గునకు తగిన శాస్తి అయినదని యందఱును సంతోషించినారు.

# 4

అన్నయ కటకపురమును జేరిన తరువాత జరిగిన మోసమంతయు బయల్పడెను.

రఘుదేవరాయలు కటకపురాధీశ్వరుని సమ్మోహింపజేసి గించినాడనియు అన్నయ వెంగళియై తిరిగి వచ్చినాడనియు అందఱకును తెలిసినది. అన్నయకు చచ్చిన ఛాయైనది.

వీరభద్రగజపతికి మొదట అన్నయపై చెప్పరాని కోపము వచ్చెను. ఆతఁడాగ్రహుఁడై, ఆజ్యహోమమువలెఁ గైపెక్కిన కోతివలె, తోకతొక్కిన త్రాచువలె నెగిరి పడెను. పాపము మంత్రిపుంగవుడు తెల్లమొగమువైచి వంచినతల వంచినట్లే యుంచెను.

మధురభాషిణిపై గజపతికి మోహము ముప్పిరిగొనియున్నది: కామాగ్ని పదునాల్కలుచాచి అతని దేహమును కబళించు నట్లుండెను ఆశలన్నియు నిరాశలైనవి. కలలన్నియు కల్లలైనవి. కామతృప్తి కలుగమి జీవితమే నిష్ఫలమైనట్లు తోఁచి, యాతఁడు మిక్కిలి కినుకను పడసాగెను.

ఆ యువకుఁడు అపసోపాలు పడసాగెను. కూర్చుండును. లేచును. మరల కూర్చుండును. ఉస్సురస్సురనును. ఒకింతసేపు కళింగ భూపతిని ఎగ్గాడును. మరికొంతసేపు తన

అదృష్టమునాడిపోసికొనును. కాని యెంతకునాతని మనస్సు ఊరట చెందుటలేదు.

ఆతఁడిటునటు తిరుగాడ సాగెను. ఏమి చేయుటకును పాలుపోలేదు. కాని కాళింగుఁడు చేసిన కికురింత ఆతని మనస్సును దహించి వేయుచుండెను.

"అరె! ఎంతపని జరిగినది! ఆ కళింగ గండఁడు అన్నయను పిచ్చిపుల్లయను చేసినాఁడు. ఈ యవమానము నెట్లు భరింపఁగలను"! అని యాతఁడు మాటిమాటికీ అనుకొనుచుండెను.

"గన్నయ ఎంతఁవాఁడు. ఇంతలేఁడు! పొట్టిటింగఁడు! ఎంతపని చేసినాఁడు.! వాని మిడిసిపాటు మట్టుపెట్టకుందునా! వాని కావరము అణచకుందునా!" అని ప్రల్లదములాడెను గన్నయ కుత్సితుఁడనియు, ద్రోహకారియనియు తూలనాడెను.

ఇట్లు కొంత తడవు గడచిన పిదప ఆతని కోపపు పొంగు కొంత యణఁగి చల్లారెను. అప్పుడతఁడు కార్యసాధనకు మార్గమేమియని యాలోచింపసాగెను.

ఆతనికి ఒక్కటే యాలోచన కలిగెను. ఆరాత్రికి రాత్రి సైన్యముల నాయకత్వము వహించి గళింగదేశముపైఁబడి, దానిని నిర్ధూమధామము [illegible] చుటయే [illegible]మని యాతనికి ఆక్షణమున తోఁచినది.



కాని వీరభద్రగజపతికి నోటిదురుకు తనమేకాని చేతిదురుకు తనముతక్కువ. పట్టిఅదురు గుండియ. స్వతంత్రించి యే కార్యమును చేయ సాహసింపఁడు.

అందుచేత ముమ్మరమై, తనను ముంచివేసిన అక్కసును, అప్పటికి అణచిపెట్టి ఆ కాక కొంచెము తగ్గినతరువాత అన్నయతో మంతనము సలుప నిశ్చయించెను.

అప్పటికి అర్ధమరేయి యయ్యెను. చీఁకట్లు నలుదిక్కుల నలముకొని కన్నుపొడిచుకొనినను కానవచ్చుట లేదు. ఆకాశమున రిక్కలు ఒక్కటొక్కటే జారి క్రింద పడుచుండెను.

గజపతి నిద్రాసక్తుడై పాన్పుపై అత్తమిల్లెను.

మఱునాఁడు ప్రభువు అన్నయామాత్యునికై వార్త నంపెను గాని యాతఁడూర లేడని తెలియవచ్చెను, గజపతికి పిచ్చి యెత్తినట్లయినది. కాని చేయునదిలేక ఊరకుండెను.

అన్నయ కావలయుననియే మొగము తప్పించి, పొరుగూరున కాలక్షేపము చేసినాడు, కాని నాల్గవనాఁడు రాజసన్నిధికి రాకతప్పినదికాదు. వారు మంతనంబున ఏమేమో మాటలాడిరి. ఆ సంభాషణ ఎట్లు పర్యవసించినదో మనమిక తెలిసికొన వలయును.

# 5

ఓఢ్రరాజు కళింగముపై కయ్యమునకు కాలుద్రవ్వి రఘుదేవరాయల మిడిసిపాటు నణచవలయునని కోరుకొనుచుండెను. ఆతఁడు చేసిన టక్కు తలఁచికొనినప్పుడెల్ల వీరభద్రునకు శివమెత్తుచుండెను. ఎట్లైన నాతనిపై కసి తీర్చుకొనవలయుననియు, నాతని మచ్చుమాప వలయుననియు కృతనిశ్చయుడై యుండెను.

అన్నయను కలిసికొనఁగానే ఓఢ్రప్రభువు, ముందుగ నీ విషయమును గురించియే ప్రస్తావించెను ఆ క్షణముననే దండు సిద్ధపరచి కళింగ దండయాత్ర సాగింపవలయుననెను. ఆపని అప్పటికప్పుడు జరుగవలయునని యాతఁడు మంత్రిని తొందర పెట్టసాగెను.

ప్రభువు ప్రకటించిన గసిబిసి చూచి అన్నయ, కళవళ పడెను. కొంచెము తత్తర పడెను. ఆతని తుకతుకఁ జూచి తుళ్లిపడెను. కాని వెంటనే తన్ను తాను సవరించుకొని "సరే! యనెను" గాని అంకిలిపెట్ట తలంపలేదు. అట్లు సేయుటకు కారణమొండు కలదు.

అన్నయకు ఒక కుమారుఁడున్నాఁడు. రఘుదేవ రాయలకు లేక లేక ఒక్కకొమరితె కలిగెను. ఆమె పెరిగి

పెద్దదై చక్కనిచుక్క యయినది. వీరిద్దఱకును పెండిలిసేయవలయునని అన్నయ పెద్దకోరిక యొకటి పెట్టుకొనెను,

తన కొమరుఁడు ఆమె కాలు తొక్కి కంకణము కట్టినచో, కళింగరాజ్యము తనవశమగునని అన్నయ ఉవ్విళ్ళూరుచుండెను. అందులకై అతఁడు విశ్వప్రయత్నము చేసినాఁడు. కళింగ భూపతికి ఈ విషయమై పలుసారులు వర్తమానమంపెను. కాని అన్నయ కుటుంబ పరిస్థితులును విఱుగఁబాటును రఘుదేవున కెఱుకయే! అన్నయ పట్టి కుత్సితుఁడు. అబ్బకాఁడు. కయ్యాల క్రచ్చ.

అట్టివానితో వియ్యమొందుటకు కళింగ భూపతికి ఏమాత్రము ఇష్టములేదు. అందుచేత నాతఁడీవిషయమున తన అసమ్మతిని అన్నయకు ఎఱింగించెను.

అన్నయ ఈ మాటవిని మండిపోయెను. ఎన్నియో తెన్నుల బతిమాలియు భంగపడియు చూచెను. కాని యాతని ప్రయత్నములన్నియు వ్యర్థములయ్యెను. అప్పటినుండియాతఁడు ఉక్కటముగ కక్కటపడసాగెను. ఎట్లైనను రఘునాదేవుపై కసి తీర్చుకొనుటకై మెరమెరలాడుచు ఆతఁడు అదను కొఱకై వేచియుండెను. రఘుదేవునిపై కసి తీర్చుకొనుటకు ఇప్పుడతనికి మంచి సందు దొఱకెను.

భూపతికి పురి ఎక్కించి కళింగముపై యుద్ధము ప్రకటింపఁజేసిన, అటు వీరభద్రుని కార్యము నెరవేరుటయే కాక రఘుదేవుని కూఁతురు, ప్రభాతి, తనకైనసమగునని

అన్నయ సంబరపడెను. అందుచేత తన ఏలిమీఁడు, తనతో మంతనము సలిపినపుడు అన్నయ కళింగదండయాత్రకు సుముఖత్వమునే వెల్లడించెను.

ఈమాట విన్నంతనే గజపతి కడుపునిండెను. అతని ప్రాణము కుదుటఁబడెను. అతఁడు అన్నయను అభినందించి మరి తడవుసేయక సైన్యముల పోహాణింపుమని వేడుకొనెను.

కాని కళింగముపై దండెత్తుటకు అది ఏమాత్రము సమయము కాకుండెను. ఈ విషయము ప్రభువుతో చెప్పుటకు అన్నయ పెద్దపొద్దు సంశయించి, చివరకు ధైర్యముచేసి చెప్పినాఁడు.

అప్పటికి ఉత్కళరాజు బొక్కసమున కాసు లేదు. సైన్యములు కూడ మట్టసముగ నుండెను. వారైనను సుశిక్షితులుగారు. ఉక్కుతునకలైన, కళింగసైనికుల నోడించుటకు ఒడ్డె సైన్యములకు సత్తువ చాలదు. క్రొత్త సైన్యములకూర్చి, సైనికబలమును వృద్ధిసేయ వలయును. అప్పుడుగాని దండయాత్ర సలుపుటకు వీలుండదు. ఈవైనములన్నియు అన్నయ రాజునకు తెలియఁజెప్పెను.

ఇదివిని, వీరభద్ర గజపతి మొదట కొంచెము నిరుత్సాహపడి గుక్కిళ్ళుమ్రింగెను. కాని సైన్యపుఁగిటుకులన్నియు తెలిసినతన ప్రధానామాత్యుఁడట్లు చెప్పుచున్నపుడు తానుతొందరపడి మాత్రము లాభమేమియని తలఁచి అప్పటికి మిన్నకుండెను.

# 6

ప్రభువు ఊరకుండెను గదాయని అన్నయ కన్నడ సేయలేదు. అతిత్వరితముగ సేనల కూర్పసాగెను. ప్రజలవద్ద నుండి అప్పులు చేసి ధనమును గూర్చి సైనికుల కీయవలసిన సంబళముల నిచ్చివేసెను. వారికి క్రొత్తదుస్తుల నిచ్చెను, క్రొత్తకత్తళముల నిచ్చెను. ఔత్తరాహులను పిలిపించి తన సైనికులకు శిక్షణ నిప్పించెను. ఈ పని యంతయు చేయుటకు రెండు నెలలు పట్టెను.

ఉన్న సైనికులు చాలరు. అందుచే క్రొత్తవారిని సైన్యములోఁ జేర్చికొనెను. మగటిమిగల పోటుమానిసులఁ బెక్కుండ్రి వెదకి తెచ్చి సైన్యమునందు ప్రవేశపెట్టెను. ధనవంతమైన కళింగ దేశమును దోచుకొని సంచులు నింపుకొన వచ్చునని సంబరపడి, కొందఱు టాటోటి గాండ్రు దబ్బర గాండ్రు దండులో చేరిరి. ఈ విధముగా సైన్యము బలపడినది.

ఇంతలో కార్తీక మాసము వచ్చినది. కారు మబ్బులు మాయమైనవి. రాత్రులందు పుచ్చపువ్వులవంటి వెన్నెలలు కాయఁజొచ్చెను. అదిమంచి యదనుగా గ్రహించి అన్నయ దండయాత్రకు సర్వము సిద్ధమైనదని తన దొర కెఱింగించెను.

ఒక పున్నమరేయి సైన్యమును ఒకచోఁ జేర్చి, వీరభద్రుఁడు తనకు జరిగిన అన్యాయమును గూర్చియు, గన్నయ తను కనుబ్రామిన విధంబును గూర్చియు ముచ్చటించి వారిని రేఁగఁగొట్టి అనికి పురికొల్పెను.

ఆ తరువాత దండు బయలుదేఱినది. కొందరు సైనికులు తట్టువముల నెక్కిరి. మన్నీఁడును మంత్రియు మదగజములపైఁ గూరుచుండిరి. తక్కినవారు పాదచారులైరి.

ఆ దినములలో రాజమార్గములు లేవు. నాటుమార్గముననే వారు ప్రయాణముసాగించిరి. దారి పొడుగునను మహీరుహములు తలలూపి వారికి స్వాగతమిచ్చినవి. ఒక్కొక్కచోట పొగడచెట్లు తమ శాఖలక్రింద నడచుచున్న సైనికుల శిరములపై సేసలు జల్లినట్లు, పుష్పములను వర్షించినవి.

ఆసేనలు ఒకప్పుడు పర్వతమయ ప్రదేశమున నడువవలసి వచ్చెడిది. వారు కొండ కొమ్ములనెక్కిరి. లోయలలో దిగిరి. ప్రపాతములదాటిరి. దారి కడ్డము వచ్చిన కొండ కాలువలు, వాగులు, వాకలు, వంతలు దాటుచు వారు ప్రయాణము చేసిరి.

ఒక్కొక్కచోట ప్రకృతి అలంకరించుకొని దర్శనీయముగ నుండెను. మాధవీలతలు తమాల వృక్షములను పెనవేసి కొనినవి. ఆదృశ్యము రమ్యముగ నుండెను.

దేశము సుభిక్షముగ నుండెను. మెట్ట పొలములలో మినుములు, కందులు, పెసలు, పండినవి. మాగాణి భూములలో అక్కుళ్లు ఆకు సన్నములు చంద్రవంకలు వంకసన్నాలు బంగారు తీగలు కుసుమలు కాకిరెక్కలు మొదలగు ఎన్నియో రకముల వరిపైరులు సాగు అయ్యెను.

కొన్ని పైర్లు పండి కోఁతకునచ్చి సిద్ధముగ నున్నవి. గజపతి ఆ పంటభూములను పాడుచేయువలదని తన పరిజనమును నిశితముగ శాసించెను.

ఆ దండు పయనించు మార్గమున ఫలవృక్షములు మెండుగనుండెను. సైనికులు వివిధ ఫలములఁగోసికొని కడుపార భక్షింపసాగిరి. వారు రాత్రివేళలందు వృక్షముల క్రింద విడిదిచేసి విశ్రాంతి తీసికొని తెలవాఱఁగనే మరలఁబ్రయాణము సాగించుచుండిరి.

కొన్ని దినములిట్లు ప్రయాణము చేసిన పిమ్మట గజపతి సైన్యములు కళింగ పట్టణమును సమీపించినవి. పట్టణమును సమీపించిన కొలఁది వీరభద్రునకు మధుర భాషిణిని ఎప్పుడు చూతునా యనెడి ఆలమట హెచ్చసాగెను. అతని ఊహలు ముందునకు పరుగెత్తుచుండెను. అన్నయకు ప్రభావతిని తన వశముచేసికొని కోడలినిగాఁ జేసికొనవలయు ననెడి అలవోక అతిశయించుచుండెను. అతని హృదయము తీవ్ర వాంఛలతో తొకతుక లాడసాగెను.

కళింగ పట్టణము ఇంకను చేరువ అయినది. గజపతి ఉద్రిక్తుఁడుకాసాగెను. అతఁడు అన్నయతో ఇట్లనియెను. "అన్నయా మనను మోసపుచ్చినది గన్నయ. గన్నయను వదలరాదు. అతని పరిజనమును, చీల్చిచెండాడి, అతని మచ్చమాపవలయును. అటుతరువాత మధురభాషిణి పని పట్టవలెను."

అన్నయ తన ప్రభువు చెప్పినదానికెల్ల తల యూఁపును. మంచిది అట్లే చేయుదమనును. "ఆ రాజప్రాసాదమున కాల్వెట్టిన తక్షణమే మధురభాషిణిని జుట్టు పట్టుకొని లాగుకొనివచ్చి మీ మ్రోల నిలుపఁగలను. తడవు సేయను" అనును. గజపతి ఈ ప్రలాపములను విని ఉబ్బి తబ్బిబ్బులగుచుండెను.

అప్పుడే అతని ఊహాలు పరుగిడసాగినవి. మధురభాషిణి తన పాదములపైఁబడి ఏడ్చుచున్నట్లును, తానామెను లేవనెత్తి సందిటఁజేర్చినట్లును మధురభావ మొకఁడు అతని మస్తిష్కమున మెరసెను. ఇట్లు అనేక విధముల నాతఁడు తలఁపుసేయసాగెను. మన్మథుఁడు అతని మన స్థలమున, "తైతక్క"లాడుచుండెను. ఇట్టి తియ్యని తలఁపుల వలన అతనికి మెయిమఱపు కలుగుచుండెను.

ఇంతలో వారు పట్టణమునకు మిక్కిలి చేరువ అయినారు. కనుచూపు దూరమున కోట గోడలు కనుపించినవి. శత్రుసైన్యములు ఎదురువచ్చి తమ్ముఁ డీకొను సమయ మదియేయని వారి కప్పుడు తోఁచినది. వెంటనే అన్నయ సైనికులను అప్రమత్తులుగా నుండుఁడని హెచ్చరించి ముందునకు సాగుఁడనెను.

అదేమి చిత్రమోకాని శత్రు సైన్యముల అలజడియే లేదు. గజపతి సైన్యముల నడ్డగించుటకెవ్వరును రాలేదు. ఆకారణమున ఓఢ్రసేనలు నిరాఘాటము

పట్టణమున ప్రవేశించినవి. సైనికులు రాజ భవనములను డగ్గిఱినను వారి నెవ్వరు తాఁకలేదు. ఇది చాల అబ్బురముగనుండెను.

ఒడ్డిరాజు ప్రాసాదమున ప్రవేశించినను. ఆతనిని అడ్డగించువారు ఎవ్వరును లేకపోవుట మఱింత విచిత్రముగ నుండెను. కళింగ భూపతి భటులు కొందఱున్నను వారు, ఉత్కళప్రభువునకు సాగిలపడి దారి నిచ్చిరేగాని దగ్గరకునైన రాలేదు.

కాళింగులు పిరికి పందలు అయినారా! తన ప్రతాపమునకు వెఱచి తన కఱకు కత్తి కెఱయగుట తప్పదనితలఁచి వారట్లు చేయనెతి అయిదు పది చేసినారా? వీరభద్రునకు కేమియు తెలియలేదు. అన్నయకుఁగూడ ఏమియుఁదోఁపలేదు.

అదేమి చిత్రమో రాజభవనమంతయు నిర్జనముగ నుండెను. కళా కాంతులు లేక యుండెను.

అచ్చటచ్చట సేవకులుండిరి. కాని వారెవ్వరును. గజపతి సైన్యముల కడ్డు తగులలేదు.

గజపతి నిర్భయముగ ప్రాసాదము నంతటను కలయదిరిగెను. కాని యాతనికి కావలసినవారు కనిపింపక పోవుటయే విచిత్రముగ నుండెను.

రఘుదేవరాయలు, ప్రభావతి, మధురభాషిణి ఏమైనారు? వారెందును కనిపించుటలేదు. సేవకులు వారిని గుఱించి ఏమియును చెప్పరు.

మధుర భాషిణి కోసము పరిభువును ప్రభావతి కోసము అన్నయయు ఆరాటపడిరి. వారికొఱకు కోటనంతయు వెదకిరి. గదులన్నిటిని గాలించిరి. అఱ లన్నియుకలయఁ జూచిరి. అంతఃపురములు, హజారముల కుసిగుంపులు పడి ఎంత వెదకినను వారు కానరాలేదు.

గన్నయ ఏమయ్యెనో తెలియదు. మిగిలిన ఉద్యోగులందఱు ఎక్కడ దాగినారో తెలియదు. అందఱును మాయమైనారు. కోటయు, పరిసరములనున్న భవనములును పాడుపడి నట్లున్నవి. మనుష్య సంచారమే కానిపించుటలేదు.

వారందఱు ఎచటికి పోయినారో చెప్పుఁడని సేవకుల నెంతచావ మోదినను వారు చెప్పరైరి. ఒకరిద్దఱు ఆ దెబ్బలకు తాళఁజాలక మడసిరి. కాని ఒక్కరును గుట్టును బయల్వెట్టరైరి. రఘు దేవుఁడు ఇట్లు కట్టుదిట్టముల చేసియే పోయియుండెను కాఁబోలు!.

మధురభాషిణిని ప్రభావతిని పట్టుకొనవలయునని చేసిన ప్రయత్నములన్నియు వ్యర్థములైనవి. ఇఁక రంతు చేసిన లాభము లేదని గజపతి ప్రభువునకు తోఁచినది.

శత్రువులపై పగ దీర్చుకొనుట ఎట్లో అన్నయకుఁ గాని గజపతికిఁగాని తోఁచలేదు. మధుర భాషిణి మాయమైనది. రఘుదేవరాయలు చేసిన అవగడమునకును గన్నయ

చేసిన మోసమునకును వారిని శిక్షింపవలయునని అన్నయ పన్నిన పన్నుగడ అంతయు ఎందుకును కొఱకాకుండఁ బోయినది.

ఇట్టి విపరీత పరిస్థితులేర్పడునని అన్నయ కలలోనైన అనుకొని యుండలేదు. ఆతఁడు అల్లల్లాడెను. అలమటపడసాగెను. దుఃఖము అల్లిబిల్లి గొనుచుండెను. ఏమి చేయుటకును తోచక ఆతఁడు డిల్లపడెను.

సైనికులు మాత్రము పట్టణమును దోఁచుకొనిరి. అమాయిక ప్రజలను చంపగాదని గజపతి ప్రభువు చెప్పియుండుటచే అకృత్యము లేమియు జరుగలేదు.

అన్నయ క్రుక్కిన పేనువలె లోలోన అక్కిలిపడి మనికిత పడసాగెను.

ఇంతకును మధురభాషిణి, ప్రభావతి, గన్నయ మంత్రి వీరందరును ఏమైనట్లు?

# 7

రఘుదేవరాయలు, మధురభాషిణి ప్రభావతులు ఎచ్చటకుఁ బోయిరో తెలిసికొనుటకు నంతకుముందు పదునేను దినములక్రిందట జరిగిన విషయములు మనము మనస్సునకుఁ దెచ్చుకొనవలయును.

అన్నయ వెడలిపోయిన తరువాత నెలరోజు లేగడచియును జరుగకుండుట వలన వీరభద్రగజపతి ప్రతీకార మేమియు జరుపఁదలఁపలేదని గన్నయాదులు అభిప్రాయపడిరి.

రఘుదేవరాయల విషయమై మనమొకింత తెలిసికొనవలయును. ఆతఁడు అపత్నీకుఁడు. ఆతనిభార్య, తనకొమరిత ప్రభావతి అయిదేండ్ల ప్రాయము గలదిగా నున్నపుడు ఆకస్మికముగ చనిపోయినది. అప్పటినుంచి రఘుదేవుఁడే ప్రభావతికి తల్లియు తండ్రియు నాయెను. ఆతఁడాబిడ్డను అల్లారుముద్దుగ పెంచుకొనుచుండెను.

రఘుదేవరాయలిపు డిరువదియేండ్లవాఁడు. ఆతఁడుదయమున నేలేచి స్నానముచేసి మొగమునవిభూతి ధరించును. నొసట కుంకుమబొట్టు పెట్టుకొనును. అతడు కఠినీకృతమైన దేహయష్టి కలవాడు. పవిత కేశుఁడైనను పటుత్వము తగ్గనివాఁడు. విశాలమైన నేత్రములుగలిగి యాతడు చూపరులకు

భయము గొల్పుచుండును. కాని యాతని హృదయము కను మెత్తనిది. అది నవనీతము సంస్కృత మధుర భావములచేత నార్ద్రమైన మనః ప్రవృత్తి కలవాఁడు.

ఆయన యెంత ఉక్కరి యైనను, వార్ధక్యపు వాసనలు పట్టకపోలేదు. ఆయన కిప్పుడు తీర్థయాత్రలు సలుపవలయునని కోరిక జనించెను. ఈ విషయమై యాతఁడు మంత్రి గన్నయతో ప్రసంగించెను. కొంత తడవాలోచించిన పిమ్మట గన్నయామాత్యుఁడు ప్రభువును తీర్థయాత్రలు సేవింపుమనియే ప్రోత్సహించెను.

రఘుదేవుఁడు సహజముగా సాధువు. ధర్మానురక్తుఁడై మధురభాషిణికి రక్షణము నొసంగెను. అంతియే కాని గజపతిపై ఆయనకెట్టి ద్వేషమును లేదు.

కాని గజపతి స్వభావము వేరు. గన్నయకు ఆతని ప్రకృతిని గుఱించి బాగుగా తెలియును. రాఁగల ఆపదను గుఱించి ఆతఁడు ముందుగనే తెలిసికొనెను. వీరభద్రుఁడు తనకు జరిగిన అవగడమును గూర్చి మఱచిపోవునన్న మాట తది. ఆతఁడు పగఁబట్టి కళింగముపై పడక మానఁడు. గజపతులతో తనకు పోరు తప్పదని గన్నయ ఎప్పుడో గ్రహించినాఁడు.

పోరు ఎట్లును తప్పదు. అందు ఎవరికి జయము లభించునో చెప్పుట కష్టము. ఒకవేళ కళింగ సైన్యమునకే ఓటమి కలిగినచో దానివలన నోరులేని ప్రజలకు కలుగు నష్టముమాట అటుంచి, ప్రభావతికిని, మధురభాషిణికిని, ముప్పుతిప్పలు తప్పవు.

ఈ పరిస్థితులలో రాజు కొంతకాలము దూరస్థుడయి యుండుట మేలని గన్నయ తలంచెను. దుష్టునకు దూరముగ నుండుట మంచిదని యనుకొనెను. గన్నయ అన్ని విధముల దిట్టముగ నాలోచించి వీరభద్రుని తుకతుకలు తగ్గుటకును ప్రభువును, ప్రభావతియును, ప్రచ్ఛన్నముగా నుండుటయే మంచిదని, నిశ్చయించినాడు. ఇంతగా నాలోచించి గన్నయ రాజుగారి ప్రయాణమునకు నిష్టుడయ్యెను.

ఆ తరువాత ప్రయాణ సన్నాహము లతిత్వరితముగ జరిగెను. కావలసిన వస్తువులన్నిటిని సంగ్రహించి బండ్ల కెక్కించిరి. క్షేమ తండులముల సమృద్ధిగ గైకొనిరి. కొలది సేవకులతో పయనము సాగవలయునని గన్నయ నిశ్చయించెను.

ఈ ప్రయాణములో మధుర భాషిణి ప్రభావతి పోషణ చూచుటకును అండుతోడుగ నుండుటకును ఏర్పాట్లు జరిగినవి.

ఇటులంతయు సిద్ధమైన పిమ్మట ఒక శుభదినమున ప్రయాణము నిశ్చయింపబడినది. గజపతి దండయాత్ర ఇంకను పదు'నేను దినములున్నదనగా, కళింగభూపతి స్వదేశము విడిచి పారమార్థచింతలతో పొరుగు భూముల కరిగెను. ఆ కారణముననే గజపతివచ్చినపుడు వారెవ్వరును లేకుండుట సంభవించెను.

రాజప్రాసాదము నిర్జనముగా నుండునట్లు సేయుట, శత్రువులకు అడ్డుతగులకుండుట మొదలైనవన్నియు గన్నయ

శేముషీ దురంధరత్వమునకు సాక్ష్యములు. అవి ఆతని రాజకీయపు టెత్తులు. పగవారిని బిత్తరకొట్టుటకు వేసిన జిత్తులు.

రఘునాథరాయాదులు యెట్టి కానివేళను బయలు దేరిరో కాని, వారికప్పటి నుండియే ఇక్కట్టులు ప్రారంభమయ్యెను.

కళింగరాజ్యమున పెద్దాపురమను పట్టణమొకటి కలదు. కళింగపట్టణమునకది పదియామడల దూమురనున్నది. అందు జగ్గరాజు అను క్షత్రియ గృహస్థుఁ డొకఁడుండెను. అతఁడు తనకు బాల్యమిత్రుఁడును, దూరపుబంధువును అయిన కారణమున రఘుదేవుఁడు కళింగపట్టణమునుండి ఆ పోయిన పోక పెద్దాపురమునకే పోయెను.

# 8

మధురభాషిణిని, ప్రభావతిని తన వశముచేసికొన వలయుననెడి రెండవ ప్రయత్నము కూడ ఈ కయివడి సున్న యగుటవలన అన్నయ మిక్కుటముగ కినుకను పొందసాగెను.

దొర దండయాత్రకు తొందర పడిన యప్పుడది సమయము కాదని చెప్పి యాతనిని వారించెను. ఎట్లో సైన్యములను జతపఱచి అప్పుడే వచ్చియుండినచో నింతపని జరిగి యుండెడిదికాదు. గజపతి ప్రభువు దృష్టిలో తాను క్రిందుపడి యుండవచ్చును. ఇట్టి తలఁపులాతనికి ఎక్కుడుగ నుత్తలపాటు కలిగించెను. జరిగిన దానికి అన్నయ మిక్కిలి యంగలార్చి చేయునది లేక నకనకలాడి పోయెను.

ఇదియంతయు గన్నయ పని. మొదటి నుండియు తనకు గన్నయయే యడ్డు తగులుచున్నాఁడు. ప్రభావతిని తన కుమారునకు కాకుండ చేసినది గన్నయ కాక మరెవ్వరై యుండును! తాను మధురభాషిణిని వెంటాడి వచ్చినపుడు తనను కికురించి పంపినది కూడ ఆ మతకరి గన్నయయే కదా! ఇపుడు తాను సైన్యసమేతుఁడై రానున్న సంగతి ముందుగనే గ్రహించి మధురభాషిణిని, ప్రభావతిని, కన్నుల కగుపడ కుండఁ జేసినది ఆ దుండగీడు గన్నయయే! గన్నయ యన్నిటికిని సమర్దుడు. మొనగాఁడు. మాయావి.

ఇట్టి తలఁపులు వచ్చుసరికి అన్నయ మొగమెత్తి చూచెను. రోసము పుట్టుకొని వచ్చెను. అతఁడు తనముందువీధిని గన్నయను నిలువబెట్టి యీ తెన్నున తెగడసాగెను.

"ఒరీ గన్నయ! నీకెంత మిడిసిపాటు వచ్చినది! నీవే దిట్టవని అనుకొనుచున్నావు గదా! నీ మిడిసిపాటు అణచెదను. నీ మైకము వదలఁ గొట్టెదను!

ఒరీ గన్నయా! అన్నయ పిచ్చిపుల్లయ్య అని అనుకొంటివి కాఁబోలు! కాదు. కాదు. అన్నయ నీ డొక్క చీల్చి డోలు కట్టఁగలఁడు. జాగ్రత్త."

"మధురభాషిణిని, ప్రభావతిని ఎచటదాఁచితివో చెప్పుము. లేనిచో నీ ముచ్చుమాపఁ గలను."

ఈ విధముగా ప్రగల్భములు పలుకుటవలన అతనికి కొంత తృప్తి కలిగెను. మనస్సున కొంత ఊరట జనించెను.

అప్పటికి చేయునదేమియు లేక అన్నయ తనయేలికతో నచ్చిక బుచ్చికములాడి చిఱ్ఱుబుఱ్ఱు మనుచున్న అతని నెట్లో ఉపశమింప జేసెను.

గజపతికి అప్పటికి చిటచిట కొంత తగ్గెను. విసుగు వలననో వికారము వలననో ఆయనకు మధురభాషిణిపై నున్న మోజు తగ్గెను. అందుచే ఆయన ఆవిషయమై వేండ్రము లేక యుండెను. "పోనీ, అందనిదానికై అఱ్ఱు సాచనేల! ఆ యున్నులమిన్నకై యుండెజందెలు పడనేల యుని తలపోసి యాజేఁడు తత్తరపడుట మానెను.

కాని అన్నయ మాత్రము తన్ను తానట్లు సంభాళించుకొన లేకపోయెను. ఎట్లైనను ప్రభావతిని పట్టి తన

కుమారునకు బలిమినైనను పెండిలిచేయవలయును. చేసినచో కళింగరాజ్యము తన కైవసమగును. ఎట్లు ఈపని సాధింపవలయునని అన్నయ తికమకలాడఁజొచ్చెను.

"గన్నయ చేసిన లూలామాలము అన్నయయెదను కోఁత కోయుచుండెను. ఆ దుండగీఁడు తనకు తలవంపులు తెచ్చిపెట్టినాఁడు. అరవాయిపడి యాతని నదలింపక విడిచిపుచ్చుటకంటె మరణమే మేలు" అని యా మంత్రిపుంగవుడు కొంతవడి కొందలపడెను.

ఇంతలో రోసము పెనుఁగొన అతఁడు మరల నీ తెఱంగున తలపోసెను. "గన్నయ ఏమి గండఁడా! ఆతనికెందుకంత మిడిసిపాటు. ఈ మిడిమేలపు మానిసిని కడముట్టింపక నే మనినఏమి, మడిసిననేమి! నేను వేగుల వలన వాడున్న తెఱఁగెఱింగి, సత్వరము చని ప్రభావతిని పట్టుకొనవలయును." ఈ విధముగ నాతఁడు తనకు తాను ధైర్యము చెప్పుకొనినాఁడు.

అటు పిమ్మట వేగుల వాండ్రను నలుదిక్కులకు పంపెను. రెండు నెలలలో నాతనికి వారిజాడ తెలిసెను

తరువాత నతఁడు దొరవద్ద సెలవు గైకొని పరిజనములేక ఒంటిమై బయలుదేరెను. భోజనము చేసినచోటున పరుండక అతడు తన పయనమును సాగించెను.

అన్నయ హుటాహుటిని పెద్దాపురమున కేగెను. వేగులవాండ్రు తనకు తెల్పిన రీతి. ఆ పట్టణముననున్న జగ్గరాజుగారి యింట రఘు దేవరాయలుండెనని యాతనికి వేగుల వాండ్రు తెలిపియుండిరి.

అన్నయ యేపని తలపెట్టినను పెద్దమ్మ యాతనిని వెంటాడుచున్నట్లున్నది.

ఎక్కడి కటకము, ఎక్కడి పెద్దాపురము! శ్రమ కోర్చి అష్ట కష్టములను పడి. యాతఁడిక్కడికి రాఁగా ఇచ్చటఁ గూడా తనకు కావలసినవారు కనిపింపకుండుట ఏమి కర్మము!

కావలసిన వారే కాదు, అచ్చట ఎవ్వరును లేరు. జగ్గరాజుగారి తిరుమాళిగకు బయట తాళముల్లు వేసియున్నవి ఆయింటి యందెవ్వరును లేరు.

అన్నయ నిలువున నీరై నిలువఁబడినాఁడు. ఆశ్చర్యము, అధైర్యము, అక్కలిపాటు ముప్పిరిగొన, అన్నయ నిశ్చేష్ట కాష్టాకృతిని నిలువఁబడినవాఁడు నిలువఁబడినట్లే యుండిపోయెను.

# 9

రఘుదేవరాయలు ప్రభావతిని మధురభాషిణుల, పెద్దాపురమున విడిచి పెట్టుతాను తీర్థయాత్రలను సేవించుటకు దక్షిణదేశమునకు వెళ్లియుండెను. జగ్గరాజుగారును ఆయన భార్య తిమ్మాయమ్మగారును, ప్రభావతిని తను కన్నబిడ్డవలె చూచుకొనుచు అల్లారు ముద్దుగఁబెంచు కొనుచుండిరి.

ప్రభావతి మధురభాషిణి పెంపున నున్నయపుడు నాట్య విద్య నేర్చినది. ఆమె యావిద్యయందు సమాన పాండితిని సంపాదించెను,

ప్రభావతి మధురభాషిణి వద్ద ప్రతిదినమును ఉదయమున సాయంతనమున నృత్యము నేర్చుకొనును. అర సంజె లందున ఒక కొంత తడవామె సంగీతమును సాధన చేయును. మధురభాషిణితో నున్నంతసేపు ఆమె కిల కిల నవ్వుచు సంతోషముగనే యుండును.

చిన్నతనముననే తల్లి గతించుటయు తండ్రి పర దేశముల కేగుటయు ప్రభావతికి దుఃఖ కారణము లయ్యెను. ఇక్క తన ఒంటరిగ నున్నయపుడు మాత్రమామె విషాద వదనయై కనిపించుచుండును.

అట్టి యున్మనికము వచ్చినపుడు ప్రభావతి ఆరామములోనికేఁజని యొంటిమైఁజరియును. తనలో తా నేదియో తలపోయును. ఉస్సురస్సురనును. ఎందులకో ఫుల్లసిల్లును. ఎందులకో బెగడొంచి, దురపిల్లును.

మధురభాషిణి యామెను కంటికి రెప్ప వగది కాపాడుచున్నది. కాని ప్రభావతి ఆమెను కనుఁబ్రామి తన కిచ్ఛ వచ్చిన చోటున కరిగి చరించుట అలవాటు చేసికొనినది.

ఈ యాగడమును కనిపెట్టి తిమ్మాయమ్మగారా బిడ్డను ఆలింగనము చేసుకొని, "తల్లీ, నీవట్లు ఏకతమ చరింపకుము. లోకము పాపిష్ఠిది. అన్ని రోజులును మనవికావు. ఈ ప్రాంతముల అటమటకాండ్రు, ఆకతాయిలు, తుంటరులు పెచ్చు పెరిగియున్నారు. అట్టివారివలన నీకెట్టి ఎగ్గు కలుఁగునో యని మాకు భయము కలుఁగుచున్నది. నీవట్లు ఒంటరిగా తిరుగాడ వలదు. అదియునుఁగాక మాకు బిడ్డలు లేరు. నీతండ్రికైనను మాకైనను నీ వొకర్తుకవే బిడ్డవు. నీ మీఁద ప్రాణములఁబెట్టుకొని మనుగడ గడపుచున్నాము. తల్లీ, నీవు మా మాట వినవలయును. ఒంటరిగ గడపదాటవలదు." అని పెక్కు విధముల బుజ్జగించి చెప్పెను.

ఇట్లు చెప్పుచున్నపుడు మాత్రము ప్రభావతి నెయ్యమున నగు మొగము బెట్టిన "అట్లేనమ్మా, నేను ఎచ్చటికిని వెళ్లను. ఎందులకమ్మా నీకంతభయము" అని ముద్దుమాటలు పలికి యామె కంఠమును తన బాహుయుగ్మ

ముచే బంధించి ముద్దులు కుడుచును. తిమ్మాయమ్మగారు బ్రహ్మానందమున తన్మయత్వమును బొందినదగును.

కాని తిమ్మాయమ్మ మధురభాషిణులు కనుమరుగు కాఁగానే సందు చిక్కించుకొని యామె తోఁటలోని కరిగి యే వృక్షచ్ఛాయనో ఒంటరిగ కూరుచుండి మేఘముల వంక చూచుచు కూనరాగములు తీయుచు కాలము గడుపును. ఇంతలో ప్రభావతి కనిపింపలేదని మధురభాషిణియు తిమ్మాయమ్మయు నచ్చోటనకు పరుగు పరుగున వచ్చి యామెను కేల్పట్టి లోనికి తీసుకొని పోవుదురు. ఇటులను దినమును జరుగుచునే యుండును.

ఒక రోజున యధాప్రకారమామె తోఁటలోని కరిగెను. అది అపర సంధ్యవేళ, ఆకసము మేఘావృత మయ్యెను. చల్లని గాలిమంద మందముగ వీచుచుండెను. ప్రభావతి యొక మల్లెపొదకు సమీపమున కూరుచుండి ఏదియో మనసున తలపోయుచుండెను.

నిజమునకది సంతోష సమయమే. ప్రకృతి యంతయు నానందమయముగ నుండెను. కిసలయముల కడుపార మెక్కిన కోకిలయొకండు ఏ వృక్షాగ్రము నుండియో కుహూకుహూయనెను. చిలుకలు గోరువంకలు కలసి సుమనోజ్ఞమైన సవ్వడులు చేయసాగినవి.

అప్పటికి సాయంతనమైనది. కారు మేఘములు క్రమ్ముకొనినవి. నెమళ్లు సంతోషముతో తుంపెసలాడసాగినవి.

నీలకంఠి నిజముగ నాట్య సుందరియే యని ప్రభావతి తలపోసినది. ఆ మయూరగముల పింపిళ్లు చూచిచూచి ప్రభావతి తన మనికి తనమును మఱచి పోయినది. ఆమె యుల్లము సముచితోల్లాసమున అల్లల్లాడఁ జొచ్చినది.

ఆమె ప్రకృతి రామణీయకతను అవలోకించుచు, ద్విజ సంతానముయొక్క మధుర కూజితముల వినుచు కొంత కాలము గడిపినది.

అంత నా బిడ్డ తా నున్న చోటునుండి లేచి పారిజాత ప్రసూనములఁ గొన్నింటిని సంతరించుకొని తటాక సమీపముననున్న తరుస్కంధము నొక దానినానుకొని కూర్చుండి పూలను మాలగా గ్రుచ్చుచుండెను. వింత వింత తలఁపులతో ఆబేల మనస్సు మబ్బుకొనియుండెను.

సూర్యుఁడ స్తమించు సమయమయ్యెను, సంధ్యా కిరణములు మేఘపుటంచులకు బంగారు పూఁతలు పూయుచుండెను.

ఇంతలో నెచ్చటనుండివచ్చినదో కాకిమూఁక యొకటి యదాటుగవచ్చి సమీప వృక్షశాఖలపైవాలి ఒకసభ చేసినది. విషయమేదియో మనకు తెలియదుగాని యవి యన్నియు జీవితమునకు సంబంధించిన ఒక ప్రధాన విషయమును గురించి చర్చించుచున్నవి యని మాత్రము మనమూహించవచ్చును. అన్ని చర్చలు సాధారణముగా నెటు లంతమొందునో ఈ కాకి మహాసభలోని చర్చగూడ అట్లే పర్యవసించెను. పెద్ద

గందరగోళ మయినది. రభసయయినది. ఒకటి చెప్పినమాట మరొకటి వినక లేని సిద్ధాంతమును అవి రాద్ధాంతరీకరించెను.

ఇంతలో నిద్దరు మనుష్యులు ఆజానుబాహులు, భయంకరాకారులు, ఆకాశమునుండి ఊడిపడినట్లు అచ్చటికి వచ్చిరి. కాకములన్నియు కలగుండు పడి ఒక్కుమ్మడిని కా, కా, యని రోదింపసాగినవి.

ఆ కాలమున నాట్యమనిన ప్రజలకు ప్రీతి మెండు. నాట్య ప్రదర్శనమనిన జనులు గుంపులు గుంపులుగ వత్తురు. ఎంత ధనమైనను వెచ్చించి యట్టి వినోదమును జూచుట కిష్ట పడుచుండిరి.

ఈ కారణమున కొందరు కొంప చెఱుపుగాండ్రు, టాటోటుగాండ్రు, మొదలగు కుజనులు నాట్యము చేయ నేర్చిన సొగసు కత్తియల నెత్తుకొనిపోయి, మచ్చిక చేసికొని, వారిచే నాట్య ప్రదర్శనముల నిప్పించి ధనార్జనము చేయుచుండిరి, అట్టిమూక యొకటి ప్రభావతి నాట్యము నేర్చిన ఒయారికత్తెయని తెలిసికొని, ఆమె నెట్టులయిన నెత్తుకొని పోవలయునని నిశ్చయించి, అదనుకై వేచియుండిరి. ఆమెపై వారొక కన్ను వేసియే యుండిరి. ఇప్పుడాబిడ్డ మబ్బులో నొంటరిగ నుండుటవలన. అది వారికి మంచి సమయమని తోచినది. ఇప్పుడు హఠాత్తుగ ఆ తోటలోనికి వచ్చినది. ఆమూకకు చెందినవారే;

ఆదుష్టు లిద్దరును అతిత్వరితముగ ఆ కనుచీఁకటిలో ప్రభావతిని సమీపించి యామె నోటను గుడ్డలు క్రుక్కి కాలు చేతుల గట్టివైచి బుజములపై కెత్తుకొని, ఆ ప్రముదావనము బయట నున్నట్టి తట్టువములఁగట్టిన శకటమునఁ బడవైచిరి. వెంటనే వారువము లదలింపఁబడినవి. తత్తములు చెంగు చెంగున పరుగులువాఱినవి. మఱు నిమిసములో శకటము, అశ్వములు ప్రభావతి అందఱును అదృశ్యులైరి.

# 10

ఆ ప్రమదావనమున తరుశాఖలపైఁ గూరుచుండిన వాయసములు ఇప్పుడు జరిగిన గొడవనుఁజూచి ఒక్కుమ్మడి గొంతెత్తి గోలపెట్టినవి. ఆ సవ్వడివిని తిమ్మాయమ్మగారును మధురభాషిణియు ఇరు కేఁకులనుండి చెరచెరవచ్చిరి. చీమ చిటుక్కుమనిన ప్రభావతికి ఏమిచేటు వాటిల్లినదోయని తుకతుకలాడుట వారిద్దఱకును అలవాటైనది. తమ గాదిలి కొమరిత కెట్టి డెప్పరము వాటిల్లునోయని వారి హృదయము ఎల్లప్పుడును తబ్బిబ్బులగుచుండును.

వారు వచ్చిన తోడనే 'ప్రభావతీ'యని పెద్ద కేక విడిరి. ఎవరును పలుకలేదు. వారప్పుడు మిక్కిలి కక్కసపడి మరల మరల పిలిచిరి. ప్రభావతి 'ఓ' యనక పోవుటవలన వారు గజ గజలాడసాగిరి. అప్పట్టున గబ్బుచీకటి గుబ్బతిలియుండెను. వారి గుండెలదరెను. ఏదియో చేటు మూడినదని శంకించి ఆ తోఁటయంతయును కలయఁదిరుగుచు, "తల్లీ, 'ప్రభావతీ' ఎందుంటి వమ్మా, ఎచ్చటికేగినావు!" అని వారు బొబ్బలిడసాగిరి.

ఆ కేకలు వినిన కాకులు మాత్రము "మీ కొమరితను దబ్బఱకాండ్రు కొందరు ఎత్తుకొని పోయినారమ్మా" యని ఎలుఁగెత్తి మొత్తుకొన్నవి. ఆ కాకిభాష అర్థముకాని

కారణమున తిమ్మామ్మయమ్మయు, మధురభాషిణియు, ఉత్తల పడి అల్లాడిపోయిరి.

ఎంత తడవు ఎలుఁగెత్తి యఱచినను మాఱు పలుకు లేకపోవు సరికి వారు తమ కూతున కేదియో కీడు మూడినదని నిశ్చయించుకొనిరి. దుఃఖము పొంగి పొరలి రాఁగా వారు పెద్ద పెట్టున నేడ్చిరి. నలుగురును పోగైరి. ఆ వచ్చినవారు జరిగిన విషాద సంఘటనను గూర్చి తెలిసికొని, గగ్గోలు పడిరి, పెద్ద గందర గోళమైనది.

ప్రభావతి ఏమైనది, ఏమైనది, అని అందఱును కొంత వడి చర్చించిరి. ఆ విషయమును గూర్చి తర్జన భర్జనలు జరిగినవి. కొందరు ఇరుగు పొరుగువారు, ఆ ప్రాంతమున నెవరో కేకలు వేయఁగ విన్నామనిరి. తోఁట వెనుక భాగమున శకట మొకటి నిలువఁబడియుండుటను జూచితిమని మఱి కొందరనిరి. తుదకు వారికి ఈ బిడ్డను దుష్టులు ఎత్తుకొని పోయి యుందురన్న ఊహా మనస్సునకు తట్టినది.

దాక్షిణాత్యులు, క్రొత్తవారు ఎవరో ఆ గ్రామమునకు వెలుపల కనిపించి నారనియు వారే ఈ బిడ్డను ముచ్చిలించి యుందురనియు అచట గుమికూడిన వారిలో నొకరనిరి. అప్పటికి పదునేను దినముల క్రిందట పీఠికాపురమున ఇట్టి దుండగమే జరిగినదని మఱియొకరనిరి. చిట్ట చివరకు ప్రభావతి దుష్టుల పాలైనదనే వారు నిశ్చయించిరి. ఈ మాట విని నంతనే, తిమ్మాయమ్మ, మధురభాషిణులు, మఱియొక సారి, గొల్లున గోలపెట్టి నెత్తి మొత్తుకొని బెట్టుగ విలపించిరి.

కొంత తడవైన పిమ్మట గుబ్బతిలుచున్న ఉమ్మ. కము డిందుపడ "ఇప్పుడేమి చేయవలయును? ప్రిభానతిని ఆ దుండగీండుల బాటినుండి రక్షించుట ఎట్లు!" అని వారు తల పోయ నారంభించిరి.

"ఏమియును భయము లేదమ్మా ఆ బిడ్డను దొంగి లించినవారు ఆమె కెట్టి హానియు కలుగఁజేయరు. ఆమె చేత నాట్య ప్రిదర్శనము లిప్పించి. ధనము నార్జింతురేగాని పిన్నతి కమునను న్న ఆ కన్నె కెట్టి యపకారమును చేయరు." అని అచల నున్న ముదుసలి యొకర్తుక తిమ్మాయమ్మకు ధైర్యము చెప్పినది.

కాని మధురభాషిణియు తిమ్మాయమ్మయు, అర చే తుల తలలుంచుకొని కుతికిల పడసాగిరి.

అప్పట్టున వృద్ధుఁడొకఁడు వారి నుద్దేశించి యిట్లనెను. "అమ్మా, మీరు అపసోపాలు పడుచు నిట ఊరక కూరు చుండిన ప్రియోజనము లేదు. తరితీపు సేయక మనము ఆ దుష్టులను వెంబడించినచో బిడ్డ దక్కఁ గలదు. మనకది అలవి గాని పనిగాదు. మెత్తపాటువలన లాభము లేదు. లెండు పోదము" అని తహ తహ పడెను.

ఆ బిడ్డను ఎత్తుకొని పోయిన ఆయతికాంత్రుడు ఎంతయో దూరము పోయియుండరనియు తక్షణమే బయలు దేరుట మంచిదనియు అందఱనిరి. కావున కావలసిన సంభా

రములన్నియు సంతరించుకొని ప్రయాణమునకు వారు ఆయత్తము అయినారు.

జగ్గరాజుగారు ఎచ్చటికో పోయినవారు అప్పటికి వచ్చిరి. ఈ యుదంతమును విని వారు కొంతవడి దుఃఖించిరి. ఆయనకు చేయి కాలాడలేదు.

మధురభాషిణియు, తిమ్మాయమ్మయు ఆయనను ప్రయాణము గమ్మని తొందరపెట్టిరి. చివరకెట్లో ఊరటచెంది ఆయనగూడ పయనమునకు సిద్ధపడెను.

జగ్గరాజు గారును, తిమ్మాయమ్మగారును పతిభావతిని వెదకుటకై పడమటిదిక్కుగా ప్రయాణము చేసిరి. మధురభాషిణి దక్షిణ దిక్కై పోయినది.

# 11

ప్రభావతిని ఎత్తుకొనిపోయిన కవలికాండ్రు ఆమెను దూరదేశములకుఁ గొంపోయి ఎవ్వరును గుర్తింపలేని ప్రదేశములలో ఆమెచే ప్రదర్శనముల నిప్పింతురు గాని పెద్దాపుర సమీప పట్టణములలో నాట్య ప్రదర్శనముల నేర్పాటు చేయరు. ఈ విషయము ఒకటి నిశ్చయముగదా యని మధుర భాషిణి తలఁచినది.

రెండవది వారెంత వేగమున వెళ్లినను అప్పటికి పది పదునేను మైళ్లదూరము మాత్రమే పయనించి యుందురు. వారిని వెంబడించి కలిసికొన వచ్చును, అది అసంభవము కాదు.

కాని ప్రయాణ మధ్యమున వారు ఎచట బసచేయుదురో కనిపెట్టుట అంత సులభమైన పనికాదు. ఆ పలుగాకులు, మర్యాదస్థులు కాపురముండు తావులందు బస చేయరు. అట్టిచోట నిల్కడ వలన తమ గుట్టు బయల్పడునని వారికి ఆదరు. అందుచే వారు సందు గొందులలో జన సమ్మర్దము లేని పొలములందునను, క్షుద్రులు రాలుగాయలు, దోసకారులు మొదలగు కుజనులు [illegible] కొలువులందును ఉనికి నేర్పరచుకొని సాధ్యమైనంతవరకు ప్రజల కంటబడకుండ మెలఁగుదురు.



కావున మధురభాషిణి తానుగూడ రచ్చల, రాజ మార్గముల విడనాడి సందుగొందుల చాటు మాటుగ కారాడి ప్రభావతి కందువ కనుగొన వలయునని నిశ్చయించుకొనెను.

దుండగీండ్రు కారిడిన ప్రభావతిని మధుర భాషిణి ఒక్కర్తుక తోడునీడలేక ఏ కయివడి కనిపెట్టగలదు? ఆమె అచూకీ ఎట్లు ఎఱుంగ గలదు? అని మనము అనుకొన వచ్చునుగాని మధురభాషిణి కీ విషయమున ఆశ యొండు గలదు.

ఆమె ప్రభావతికి పెక్కు కీర్తనల నేర్పినది. అందొ కటి ఆమెకు అత్యంత ప్రియమైనది కలదు. తాను ఆ కీర్తన మొదటి చరణమును గొంతెత్తి పాడినచో రెండవ చరణ మును ప్రభావతి పాడితీరును.

మొదటి పాదమును విని నంతనే ఆమెకు గగు ర్పాటు కలుగును. మయిమఱపు వచ్చును. ఒడలు తెలియని స్థితిలో ఆమె రెండవ చరణమును పాడును. ఇట్టి కట్టు మట్టు ఉండుట వలననే ప్రభావతి ఎచట నున్నదియు తాను సులభ ముగ గుర్తింపగలనని ఆమెకు ధైర్యము కలిగినది.

ఇంత తలంపుచేసి, ఆమె ప్రభావతిని వెదకి పట్టు కొనుటకు ఇలు వెడలినది. ఆమె రాజ కుటుంబమునకు చెందిన కులీన యగుట వలన ఆమె శరీరముపై కాంచన భూషణము లెన్నియో యున్నవి. ఆమె ఒంటరిగ పయనించునపుడు ఈ

నగలన్నియు ఒంటిపైనున్నచో, ఆమె కేదైన యాపదవాటిల్ల వచ్చును.

ఇట్లు ఆలోచించి, ఆమె లలింతిక, ప్రాలంబిక ముక్తావళి, ఏకయష్టిక మొదలైన కంఠ భూషణములు, వ్రేలనున్న అంగుళీయకము ముంజేతులనున్న కంకణములు, మొలనున్న మేఖల చెవులనున్న కర్ణికలు మొదలైన హేమ భూషణముల నామె తీసివేసినది.

స్నానము లేమిని, మార్జనము మానుటవలనను ఆమె దేహము మలినము, ధూళి ధూసరితము అయినది. ఆమె జీర్ణమైన జిలి బిలిచీర ధరియించి, కూర్పాసకమును దొడిగి అంశుకము నొక దానిని పైనిఁ గప్పుకొనియెను. ఆమె చొల్లెమును విచ్చి కురులను విరియఁబోసి కొనినది. ముఖమున నల్లని మచ్చల రచియించు కొన్నది.

ఇట్లగుట వలన ఆమె కొక భయంకర రూపము వచ్చినది. చూపరులకామె వెఱపు గొలుపుచు తిక్క ఎత్తిన దానివలె కనిపించును.

బిట్టుగ తలపోసియే ఆమె ఇట్టి వేసము వేసినది. ఈ వికార రూపముననున్న ఆమెను ఎవ్వరును సమీపింపరు. చేరరు. తాకరు. ఆమె తన ఇచ్చమయి చరింపవచ్చును.

ఇట్లయి ఆమె అపర సంజల వేళలందు వీధి వీధిని తారాడుచు నిక్కుచు నృత్యము చేయుచు, గంతులిడుచు, చిందులు ద్రొక్కుచు తిరుగసాగెను.

ఆమె తన కూరిమి కూఁతునకు తియ్యనైన పాటలను తడవ తడవకు పాడుచు సందు గొందులఁబడి సంచరింపసాగెను.

ఈ విధముగ నామె పెద్దాపురమునుండి, పిఠాపురము మీఁదుగ బెజవాడ వఱకును ప్రయాణము చేసినది, గాని ఆమె కెక్కడను. ప్రభావతి వయినము ఎఱుకకు రానందున ఆమె మెరమెరకు మేర లేక యుండెను.

# 12

వేగులవాఁడు వలన ప్రభావతి ఎచటనున్నదియు తెలిసికొని ఆమెను తన వశము చేసికొన వలయునని ఊల మాల గుడిచి అన్నయ హుటా హుటిని పెద్దాపురము వచ్చి జగ్గరాజుగారి గీము తాళము పెట్టి యుండుట జూచి మిక్కిలి అతిముతి పడి నాడని మనకు తెలియును.

అతఁడు ఆ పట్టణమున రెండు దివములుండి విచారణ సేయఁగా ప్రభావతి దొంగిలింపఁబడిన దనియు, మధుర భాషిణి దక్షిణ దిక్కుగా వెళ్ళియున్న దనియు తెలియ వచ్చెను.

అన్నయకు ఆరాటము మట్టడించెను ప్రభావతి తన వసము చేసి కొన వలయుననెడి కోరిక ముమ్మరమై పిచ్చి ఎక్కించునంతటి బలమైనది అయినది.

అన్నయ ప్రభావతి కొ[illegible] అన్వేషణ ప్రారంభించి, ఊర్ఘూరు తిరుగ సాగెను. అన్నయ ప్రయత్నము లివిధముగ నుండును. ఆతఁడొక కొట్టమును చేరును. అందున్న కొందఱి గుండ గొయ్యలతో పొత్తు కలుపుకొనును. తిప్ప కాయలతో సంగడము కుదుర్చుకొనును. వారిలోఁ గొందఱకు అడిగిన ధనమిచ్చి ఆ కన్నియ ఉన్న తావును వెతకి

రమ్మని పంపును. ఆ కూళలు వల్లెయని, సొమ్ము చేఁజిక్కించుకొని వెడలి పోవుదురు. వారు సాయంతనమునకు మగుడ వచ్చుదనుక అన్నయ ఆశలు పెంచుకొనుచు తీయని ఊహాడోలికల నుయ్యాల లూఁగుచు ఇంటికడనే యుండును. తాను బంపిన వారు ఎట్టి శుభవార్తను దెచ్చెదరో యని మంత్రి ఉఱ్ఱూత లూఁగుచుండును.

అట్లు పోయినవారు పగలెల్లను తాగి తందనాలాడి రాతిరి వచ్చి, "అయ్యో ఆముద్దియ కొఱకై వెదకి వెదకి మా ప్రాణములు కడముట్టినవి. ఆబిడ్డ ఎందును గాన్పింపలేదు. రేపు ఆమెను దొరకించుకొనక పోయినచో చూడుఁడు" అని మీసలు మెలిపెట్టి బింకములు పలుకుదురు. అవినయ గారపు మాటలు, ఆ కిటుకు తెలియక అన్నయ వారి పలుకుల నమ్మి ఉబ్బితబ్బిబ్బులై మరల వారికి కొంత డబ్బును ఇచ్చును. వారు ఎప్పటియట్ల కాలము గడపి వత్తురు. రెండుదినములు గడచును. అన్నయకు విసుగు కలుగును. ప్రభావతి నెత్తుకొని పోయిన వారు ఆయూర లేరనియు పైయూర నుండ వచ్చుననియు తోఁచును. ఆతనికి ఆసలూరును. అన్నయ మఱియొక పట్టణమునకుఁ బోవును. అచటను ఈ తంతు అంతయు జరుగును. ఇట్లు అన్నయ పట్టణముల వెంట తిరుగుచుండెను.

గన్నయామాత్యునకుఁగూడ ఈ దుర్వార్త వేగుల వలన తెలియవచ్చినది. ఆతఁడు కళింగరాజ్య పరిపాలనా భార మంతయు మఱియొక సమర్థుని పరము జేసి

అమిత త్వరితముగ పెద్దాపురము వచ్చెను. అచట విచారణ చేసి జరిగిన దంతయు తెలిసికొనెను. ఆ పళమున ప్రభావతిని అరయుటకై ఊరూర నడయాడుచు ఆమె ఇక్కడ కనుగొన ప్రయత్నించుచుండెను.

అన్నయ గూడ ఆ సీమనే అదియే పనిమీద చిట్టాడుచున్నట్లు తెలిసికొని తాను ఆతని చేతులలోఁ బడకుండుటకై గన్నయ తన వేసమును మార్చి వేసెను.

గడ్డమును, మీసములును తగిలించుకొనెను. చెవులకు వలయాకారముగల పెద్ద పెద్ద పోగులను పెట్టుకొనెను. జెంప్రుడుకలను పెంచి కాక పక్షములుగ దిద్దుకొనెను. ఏదియో యొకరకము పైపూఁతవలన తన రంగును గూడ మార్చుకొనెను. ఒక్క పొట్టితనమును మాత్రము మార్చుకొనలేక పోయెను. ఆ వేసమున ఆతనిని ఎవ్వరును గుర్తింప లేరన్న మాట వాస్తవము.

గన్నయది ప్రసన్న వదనము ఆతఁడెప్పుడును నవ్వుచు మాటాడును. ఆతని మొగము మందహాస సుందరమై యొప్పుచుండును. ఎట్టి బింకపు మానిసియైనను ఆతని పలుకులు విని బ్రహ్మానందమును పొందక పోఁడు.

కన్యల నపహరించిన వారి తావులెవ్వియా యని గన్నయ ఊహింప సాగెను. ఆ తుంటరులు మర్యాదస్థులైన గృహస్థుల ఇండ్లకడ తమ ఉనికి నేర్పరచుకొనరు. అట్టితావుల విడిసిన తమ గుట్టు బయల్పడునని వారికి భయము. అదియును

గాఁక, తమ ఆకారమునకును ఆమె సొంపైన రూపమునకునుగల వ్యత్యాసము ఇతరుల అనుమానమునకు నిదానమగును. అందుచే వారు ఆ చాయలకు పోరు. కులటలు క్రొమ్మరుచుండు సీమలందు వారు బసచేయుదురని గన్నయ నిశ్చయించుకొనెను.

ఈ కారణమున గన్నయ వాడ వదినలున్న వీథులలో తానుగూడ మెలఁగుచు వారితో సరస సల్లాపములాడుచు వినోదముగ కాలము గడుపుచున్నట్లు నటించుచుండెను. ఈ వెలయాండ్రకును దొంగలకును నెయ్యముండుట ప్రసిద్ధమే కదా! అట్టి సొంపుఁగత్తెలు తనతో ముచ్చటలాడు సమయమున వారు ప్రభావతి గుట్టు మట్టు జారవిడుతురని అతని ఆశ. ఇట్టి ఆశ పెట్టుకొని అతఁడు అరదమున, వేడుకకత్తియల కొంపలను గాలించుచుండెను.

* * * *

ప్రభావతి కొఱకు వెదకుచు అన్నయ కొండపల్లి వీథులలో తిరుగాడు నపుడు అతని కొకింత దూరమున పొట్టి మానిసి యొకండు అగపడెను. నిదానించి చూచులోపున అతఁడు ఒండొక పెల్లాటకత్తియ లోఁగిలి లోనికి చరచరఁ బోయెను.

అన్నయ అతనిని జూచి మొదట త్రుళ్ళిపడెను. "ఆరె; ఆ పోయినవాఁడు గన్నయవలె నున్నాఁడు. గన్నయయేమో; ఆ తుంటరి ఈ తావుల ద్రిమ్మరుచున్నట్లు వింటిని. వీని సంగతి పట్టవలయును" అని తల పోసెను.

అతని కేమియును తోఁచలేదు. గన్నయ తన ప్రయత్నములకు అడ్డుతగులఁగలఁడు. ఏదియో ఎత్తుగడ వలన వానిని పట్టి మట్టుపెట్ట వలయును, అని గట్టిగ నిశ్చయించుకొనెను.

ఆ సాయంతనమునకే అన్నయ కోడెకాండ్రు విహరించు వాడకేగి, ఆపొట్టిమానసి చొరబడిన గీముఁజొచ్చి, అందొక సుందరిని గాంచి ఆమెకు మస్తుగ కాసులిచ్చి మచ్చిక చేసికొని "ఓ మచ్చెకంటీ ఈ ప్రాంతమున గన్నయ యను దుష్టుఁడొకఁడు మిట్టాడుచున్నాఁడు. వాఁడు తాను కళింగ రాజ్యమునమంత్రినని చెప్పుకొనును. ఆతఁడొక దేశదిమ్మరి. పలుగాకి. పొట్టిగనుండును. వాఁడు నీ సదనమున కేమైన వచ్చినాఁడా?" యని అడిగెను.

"గన్నయయో గున్నయయో మాకు తెలియదు గాని తింగణ యొకండు మా లోగిలిలోనికే వచ్చి మాకు ధన మిచ్చిరంగుగ నున్నాడు. అయిన తమ రెవరు? అని ఆ చిత్తరి యనెను.

"నేను అన్నయయను వాఁడను. మాది కటకము. నేనా దేశపు మంత్రిని. నీవు గన్నయ నెట్టులైన మాయపుచ్చి నాకు అప్పఁజెప్పితివా నీకు కోరినంత ధనమిత్తును" అని అన్నయ అనినంతనే ఆ అన్నులమిన్న పెల్లుగ నవ్వ సాగెను. ఆ ఉబ్బు తగ్గిన తరువాత అన్నయ పెక్కుసార్లు తనకీ విషయమున సాయపడమని ఆ సానిని వేడుకొనెను.

ఆ చేడియ కానుకులోనై "సరె, అట్లే కానిండు, ముందు మా ఇరవునకు వచ్చు వన్నెకాడు గన్నయ ఏమో నేను ముందుగ కనుగొని మీకు చెప్పెదను. తరువాత మీ యిచ్చవచ్చిన రీతిని చరింతును. మీరు రేపు రా తిరికిచ్చుటకు గదు." అనెను.

అన్నయ సంతోషించి ఆ వన్నెకత్తియకు కొంత ధనము నొసంగి గన్నయను సంహరించుటకు అదను దొఱకిన దనియు ఒడికమున నాతని బట్టి గిట్టింప వలయు ననియు ఊహాలు చేయుచు, గుటకలు మ్రింగుచు, తన ఇంటికి జనెను.

# 13

మధురభాషిణి తిరిగి తిరిగి బెజవాడ చేరుకొనెను, ఉన్మాదినివలె ఆమె పాడుచు వాడ వాడలఁ గ్రుమ్మరు చుండెను.

బెజవాడ పురమున గుట్ట యొకటి కలదు. దానికి తూర్పు తట్టున పరువుగల పురజనులు నివాసముల నేర్పరచు కొని సదనములఁ గట్టుకొనిరి. మెట్టకావలి వైపున పది శిథిల గృహములు గలవు. అది పలువురు గ్రుమ్మరు ప్రదేశము కాదు.

మధురభాషిణి పది దినములు బెజవాడ వీథుల నన్నిటిని గాలించెను. కాని ఎందును ప్రభావతి జాడ కాన రాలేదు. ఆమె పాటను అందుకొని పాడిన వారు లేరు.

ఆమె విసిగి వేసారినది. ప్రభావతిని జూడ గలుగుదుననెడి ఆస సన్నగిలినది. ఆమె బేల అయినది. ఆమె గొంతుక డగ్గుత్తిక వడినది.

కాని ఆమె తిరుగాడుట మానలేదు. ప్రభావతి విషయమై నిరాశ చేసికొనలేదు. పగలంతయు వీథి వీథిని మిట్టాడును. నడిరాతిరికామె తిప్పపైనున్న దుర్గగుడిని జేరి అందు శయనించును. ప్రభావతి కనిపింప నందులకు గానిఁ

డెందును, తాను పడుచున్న ఇక్కట్టులఁ దలఁచుకొని ఒక కొంత వడి కక్కటిల్లును. ఆమె తియ్యని కలలఁగనును. తిరిగి ధైర్యమును పుంజుకొని సూర్యోదయమునకు పూర్వమే కాల కృత్యములఁ దీర్చుకొని, తిరుగ అన్వేషణ ప్రారంభించును. దినదినమిట్లే జరుగుచుండెను.

ఆమె కట్టిన పుట్టంబు మాసి మసిపాత అయినది. జుట్టు జడలు కట్టినది. చెక్కిళ్లు చిక్కిపోయినవి. పళ్లు పైకి వచ్చినవి. వేళకు అన్నపానములు, స్నాన మార్జనములు లేక పోవుట వలనను, ముచ్చిరితనము వలనను ఆమె రూపు ఊచ మట్టుగ మాఱినది.

అయినను ఆమె హతాశ కాలేదు. ఆమె అంగ లార్పదు. ఉస్సురనదు. ఉమ్మలికమున కూలిపోదు. ఆమె ప్రభావతి గుట్టు కనిపెట్టవలయునని గావు పట్టు పట్టినది.

ఆమె పాడుచు నాడుచు వాడవాడల మట్టాడుట మానలేదు. చూచిన పట్టుననే చూచును. తిరిగిన తట్టుననే తిరుగును. ప్రభావతి కొఱకై చూచి చూచి ఆమెకన్నులు కాయలు కాచినవి.

జనులు ఆమెను కనులు పెద్దవిచేసికొని చూతురు. కొందఱామెకు దూర దూరముగ పోవుదురు. కొందఱు ఆమెనుగని "పాపమెవరో పిచ్చిది" అని జాలిపడి ఆమె కేదైన తినుటకిత్తురు. ఈత పండ్లు తినిన కోఁతివలె పండ్లు ఇకి

లించి, ఆమె దానిని తీసికొని తినును. లేక దూరమునకు విసరి వేయును. అది ఆమె ఇష్టము.

కొందఱు డిప్పకాయలు, ఆకతాయలు, ఆమె చుట్టును పిండుగట్టి, అల్లరిగ నరతురు. కేరింతలు కొట్టుచు గంతు లిడుదురు. దిసంతులు కొట్టుదురు. ఆమె దిగాలుపడి వారి నరయుచు పిచ్చి చూపులు చూచును. ఒకప్పుడు ఆమె రూపు మిక్కిలి జాలిని గొల్పునదియై యుండును.

కొన్నాళ్లయిన తరువాత ఆమెను గురించి బోలెడు వదంతులు పుట్టినవి. ఆమె అర్ధమరేయిని వల్లకాటను ద్రిమ్మరు చుండు ననియు పుచ్చెలలో నండిన అన్నమును తినుననియు, పిశాచములు ఆమె పిలిచిన పలుకుచుండుననియు గాలిమాటలు ఉప్పతిల్లినవి.

ఈ వదంతులు ఆనోట నానోటఁబడి గాలి పోగు చేసికొని అంతంతై కొండంతలైనవి. అర్ధమరేయి ఆమె తన కెదురైన మానిసిని పట్టి కండ కండలుగ చీల్చి సంజుడు నమలి మ్రింగుననియు పచ్చి రక్తమును. త్రాగుననియు భయంకరమైన వదంతులు బయలు దేఱినవి.

ఇంకొక విచిత్రమేమియన ఆమె పగటిపూట ఎవ్వరి జోలికిని పోదనియు రాత్రులందు మాత్రము ఆమె నేస్తులు, శాకినీ ఢాకినీ పిశాచములు, ఆమెవెంట నడచి ఆమెచే నట్టి క్రూర కృత్యములను చేయించి పచ్చి మాంస మును పంచుకొని తిందురనియు అందఱు అనుకొనిరి.

ఇట్టి వదంతుల వలన మధురభాషిణికి ఎట్టి అపకారమును జరుగలేదు. ఆమె కన్నుల కగపడగనే కొందఱు కెవ్వుమని కేకలిడి కెలకులకు తప్పుకొనుచుండినమాట నిజమే! ఆమెదాపునకు వచ్చిన తమకేమి పుట్టి మునుఁగునో యని వెగడొందు చుండుటయు వాస్తవమే!

కాని కొందఱు ఆమె అట్లు తిరుగాడుట తమ గ్రామమునకు క్షేమకరమనిరి. ఎట్లన ఆమె భయమువలన కొంప చెఱుపుగాండ్రు ఇల్లుకదలి బయటికి వచ్చుట మానిరి. దొంగతనములు, హత్యలు మొదలైన నేరములు జరుగుట అరిది యయ్యెను. ఈ కారణమున అందఱామె నొక దేవతగ పూజించు చుండిరి.

మధురభాషిణి ఇట్టుల బెజవాడలో ఇడుములఁ గుడుచుచున్నయపుడే జగ్గరాజుగారును తిమ్మాయమ్మయు ఆ ప్రాంతముననే ప్రభావతి కొఱకై వెదకుచుండిరి,

వారు భాగ్యవంతుల ఇండ్లలో బసచేయుదురు. ఇరుగు పొరుగు వారితో ఈ సంగతిని గూర్చి ముచ్చటించి మీకేమైన తెలియునా, ఈ యూర నాట్య ప్రదర్శనమేమైన జరిగినదా?» యని అడుగుదురు రక్షకభటులకీ యుదంతమును జెప్పి ఏమైన జాడలు దొరికిన తమకెఱిఁగింపుమందురు. వారు ప్రభావతి కొఱకై అన్వేషించు పద్ధతి అది!

ఇప్పట్టుననే అన్నయ గన్నయలు కొండపల్లిలో జత పడుటయును ఎట్లయిన గన్నయను పట్టి చీల్చి చెండాడవలయునని అన్నగారు పట్టు పట్టుటయు జరిగెను.

చంద్రముఖి గన్నయను అన్నయ వశము చేయుటకు అంగీకరించి మఱునాఁటి రాత్రిరి రమ్మనివది,

ఆ ముగుద చెప్పినయట్టుల చేయఁగా అన్నయ గన్నయను పట్టి వధించెనో లేదో!

# 14

అనుకొనినయట్లు అన్నయ మరునాటి రాత్రి చంద్రముఖి సదనమున కేగెను. ఆ ముద్దరాలు అన్నయను సగౌరవముగ లోగిలిలోనికి తీసికొనిపోయి ఉచితాసనంబునఁ గూరుచుండఁ బెట్టెను.

పిమ్మట ఆ నునుపు కత్తియ అన్నయ చెంబు తలను పలుమారు నిమిరి కమ్మనూనెపూసి గుమ్మ గుమ్మను నట్లు చేసెను. అతని ముంజేతులకును, మునికంఠమునకును, గంధముపూసి మురిపెము లొలికించి ముచ్చట పడెను. మరియు ఆముగుద అన్నయాను పెక్కురీతుల అలరించెను. అతనిని మిక్కిలిగ కొండాడెను·

అన్నయ ఈ సపర్యల నందుకొని సంతసమున ఉబ్బి తబ్బిబ్బులయ్యెను. అతఁడా వనితతో ఇట్లనియెను. 'ఓ త్రోయ్యలి, నీ తియ్యని మాటల కేమిగాని అగన్నయ ఎప్పుడు వచ్చును? వానినినాకు పట్టియిత్తువా? ఇంతకును మీయింటికి వచ్చువాఁడు గన్నయయేనా!"

"మా యింటికి వచ్చుచున్నది మీకుఁ గావలసిన గన్నయయే! అతఁడు వచ్చువేళ అయినది. ఇంకొక గడియకో అరగడియకో వచ్చును. మీరతని నెట్లు తీసికొని పోవుదురు?" అని చంద్రముఖి అడిగెను.

"నా వెంట ఇద్దరు సేవకులు వచ్చినారు. వారు వీథివాకిలి వద్ద ఉన్నారు. వాఁడు రాఁగనే చెప్పుము. నా సేవకుల సాహాయ్యమున నే నతని పట్టి కాలుసేతులు గట్టివైచి ఏ శకటముపై నైనను పడవైచి తీసికొని పోవుదును. అంతటితో నీపని తీఱిపోవును, ఆ తరువాత సంగతి నేను చూచుకొందును" అని అన్నయ ఆమెతో తన అభిప్రాయమును చెప్పెను.

"సరే, అట్లేకానిండు కాని ఒక్క సంగతి. ఆ తొందరలో మీరు నాకు ధనమిచ్చుటకు వీలుండదు. మీరు వాగ్దానము చేసిన మొత్తమును ముందుగనే యిచ్చి వ్యవహారము జరుపు కొనుఁడ"ని ఆ కనకాంగి కచ్చితముగఁ జెప్పఁగా నన్నయ మాఱు మాటాడక రెండువందల రూకలు ముడుపు చెల్లించెను.

ఎంతసేపటికిని గన్నయ రాకపోవుటవలన అన్నయ గసిబిసి యగుచుండెను. ఆ వన్నెలాఁడి అతనిని లాలించి "కొంచెముసేపు విశ్రమింపుఁడు. ఆయన వచ్చువేళ అయినది" అనెను.

మఱికొంత తడవు గడిచెను. అప్పటికిని గన్నయ రాలేదు. అన్నయ మరల తత్తర పడసాగెను. "తొందర పడకుఁడు స్వామీ! నేఁడు మీ కోరిక ఈడేరును" అని మెత్త మెత్తగ, మాటాడి, ఆ యువిద, అన్నయను ఊఱడించెను.

ఇంతలో దాసి యొకర్తుక పరుగు పరుగున వచినది. ఆమె బిత్తరియై, ఆపాద మస్తకము గజ గజ వడ

చుండెను. ఆమె డగ్గుత్తికతో అమ్మా "దండనాథుఁడు వచ్చుచున్నాడఁట. వారి డింగరీఁడు వచ్చి ఇప్పుడే చెప్పిపోయినాఁడు" అనెను.

అన్నయ చెంతనున్న గుమ్మయు భీతిల్లి, ఇప్పుడేమిగతి, యని సుడివడెను. ఆమె నిలువున నీరైపోయెను. కూర్చున్నది కూరుచున్న యట్లే కూలిపోయెను. మఱు నిమిసమున తేఱుకొని, ఆమె దాసి నుద్దేశించి, "శ్రీవారు ఎంత దూరమున నున్నాఁరే!" యనెను.

"ఇంటివద్ద బయలుదేరుటకు ముందే ఈ వార్తను బంపినారు. ఇంకొక అరగడియలో వారు ఇచటకు రావచ్చునమ్మా" అని ఆ కన్నియ యనెను.

ఆ మగువ బొట బొట కన్నీళ్ళు కార్చి "అన్నయగారూ పుట్టి మునిఁగినది. దండనాథుఁడు వచ్చుచున్నాఁడు, వా రూర లేరనియు, ఇచటకు రారనియు నేను తలఁచినాను. ఇప్పుడు ఆవడి వచ్చినది. ఆయన కంటఁబడిన మీ ప్రాణములు దక్కవు. ఈమాట చెప్పుటకు నాకు నోరాడ కున్నది. ఈ తావునుండి, బయటికి పోవుచున్న పురుషుఁడు ఆయన కంటఁబడిన, ఇఁక బ్రతుకుట వట్టిది" అని చెప్పలేక చెప్పెను

అన్నయ కిది పిడుగుపాటు అయినది. అతఁడు త్రుళ్ళిపడి గజ గజలాడి, తుంపెసలు పడసాగెను. ఆయన ఆ కులుకులాడి దెసఁజూచి, వీఁకను బోనాడి "ఏ కరణినైనను,

నేను పాఱిపోవుటకు ఎసలిక కలుగఁజేయుము" అని ఆకలువకంటిని బ్రతిలుమాకొనెను.

"ఇంతలో దండ నాథుఁడు వచ్చినారమ్మా" అను కేక వినవచ్చెను. ఇఁక ఆలోచనకు తడవు లేదు. ఆ ఇందువదన బిక్కమొగము వైచిన అన్నయ కేలువట్టి వడివడి ప్రక్కగదిలోనికిఁ గొంపోయి, "ఇందుండుఁడు. ఎవ్విధముననైన మిమ్ములను ప్రాణములతో బయటకు పంపుటకే నేను నా శక్తినంతయు వినియోగింతును. అయినను తప్పి వచ్చిన యమ పదనమున కేగవలయును. ఎందులకైనను మంచిది. ఈ యిసుమంత కాలమును దైవ ప్రార్థనలో గడుపుఁడు" అనిచెప్పి, అతనినందు వదలి, తలుపు బయట గడియబిగించి, చరచర వెడలి పోయినది.

# 15

చంద్రముఖి వెడలిపోయి పది నిమిసములయినది. దాసిది "వచ్చి అన్నయగారూ, దొరవచ్చె. దొరసానితో సరస సల్లాపము లాడుచున్నాడు. పారి పోవుటకు మీ కిదియే సందు. కాని మీరు వారి ముందు నుండియే నడచిపోవలయును. మరియొక దారి లేదు. వారు చూచినచో మిమ్ములను ప్రాణములతో విడువరు" అని రహస్యముగఁజెప్పినది.

ఈ మాటలు విన్నమీఁదట అన్నయ విన్నవోయి ఆ పిన్నదాని చేతులు పట్టుకొని, "ఓ కలికీ! ఎట్లైన నన్ను రక్షింపుము. నీకు పున్నెముండును. అదియునుఁగాక నావద్ద ఇంకను వందరూకలున్నవి. ఆ పయికము నీకిచ్చెదను. ఈ గండ్ర గత్తెరనుండి తప్పింపుము" అని తత్తరమున వేడుకొనియెను.

ఆ పయిని, ఆటక్కులాడి యోచనచేసి "అట్లయినచో ఒక ఉపాయమున్నది. మీరు వెనుదీయక వల్లెయనిన బ్రతికి బయట పడుటకు అవకాశమున్నది. లేనిచో చావు తప్పదు" అనెను.

"మగువా నా గండు మగఁటిమి గంగఁ గలిసినది. నీ వేమి చెప్పినను చేయుటకు సిద్ధము," అని అన్నయ పలువిధముల ఆ కన్నియను వేడుకొనియెను.

ఆ మించుబోఁడి "అట్లయిన మీరు స్త్రీ వేసము ధరియించినచో వారి ముంగలనుండియే వెడలి పోవచ్చును. దొర ఆడుదాని జోలికి రాఁడు" అనిచెప్పి ఆ చిన్నది ముసి ముసి నవ్వులు నవ్వెను.

అన్నయ ఎట్లయిన ప్రాణములు దక్కినచాలు నను కొనెను. ఆపద వచ్చినపుడు ఎట్టి వేసము వేసిన నేమి! ఈ మునుప్రొద్దున నన్ను గుర్తించువారు ఎవరుందురు అని యనుకొని, ఆ కన్నియ చెప్పినయటుల చేయుటకు అన్నయ సంసిద్ధుడయ్యెను.

అంత నా కొంటె కత్తియ చీరయొకటి తెచ్చి ఆయనకు ఆడుకట్టు కట్టినది. అంగీని తొలగించి అవిక తొడిగించినది. పయిటను శిరమునగప్పి గుజరాతి స్త్రీల కుండునట్లు మేలి ముసుఁగు రచియించినది. ఆ పయిట కొంగుతోనే మీసములను మఱుగు పరుపుమని హితవు చెప్పినది.

ఇట్టి వేసమును గట్టించి దొరయున్న తావు నుండియే అన్నయను వీథిగుమ్మము కడకు తీసికొనిపోయి "మీరిఁక దయ సేయుఁడు. జాప్యము చేయకుఁడు. ఇంటికి పోయి ఆ చీరను విడిచి చలువ మడతలను ధరియింపుఁడు" అని మెత్తని మాటలతో నాతని తనియించి పంపివేసినది.

వీథి మొగసల తన వెంట వచ్చిన సేవకులు లేరు. ఆ దండనాథుని జూచి వారు పారిపోయి యుందురని అన్నయ అను కొనెను.

అన్నయ ఈ వికృత వేసమున నడచుచుండఁగా ఒక రిద్దరు తుంటరులు చూచి వెంటఁబడి పయిటను లాగిరి. అది యాతని ముఖమునుండి జారగనే పురుషవ్యక్తి ప్రత్యక్షమయ్యెను.

స్త్రీ వేషముననున్న పురుషుని జూచి వారందరును గొల్లున నవ్విరి. ఆ సందడి విని మరికొందరు చేరిరి. మంది గుమికూడిరి. వారందరును ఆకతాయులు కావున అన్నయను పెక్కురీతుల పరిహాస మాడిరి.

కొందఱు ఆతనిని గుర్తుపట్టి "ఉత్కళ దేశపు మంత్రివిగదా, నీకిది యేమి కర్మమయ్యా!" అనిరి.

అన్నయ నవ్వులపాలై మొగ మెత్తలేక ఖిన్నుఁడై తన సదనమునకు పోయి శయ్యపై పరుండి ఇపుడేమి చేయవలయునని ఆలోచింప సాగెను.

ఇచ్చట చంద్రముఖయు గన్నయాయు ఒకరి మొగము ఒకరు చూచుకొని నవ్వుకొనిరి.

# 16

తెల్లవారినది. ఊరంతయు గుప్పుమనెను. ఎచటఁ జూచిన ఈ ముచ్చటయే చెప్పుకొనుచుండిరి. రచ్చల క్రంతల, రాజమార్గముల నీకథయే చిత్రవిచిత్రముగ వినవచ్చుచుండెను. తానిట్లు నవ్వుల పాలైనందులకు అన్నయ మిక్కిలి కక్కుట పడసాగెను.

"ఇప్పుడేమి సేయవలయును! ఇప్పుడేమి సేయవలయును?" అని అన్నయ మాటిమాటికిని అనుకొన సాగెను. ముందడుగు వెనుక బెట్టుట కాతని మనసొప్పకుండెను. ఆ కుటారి తనపట్లు అలాకు చేసిన సంగతి తలఁపునకు వచ్చినపుడెల్ల అతని ఒడలు భగ భగ మనుచుండెను.

ఎటు సేయుటకును పాలుబోక అన్నయ తన్నుకొలాడజొచ్చెను. ఉరియాడు చిత్రమును ఊరటఁబెట్టుట అతనికి సాధ్యముకాలేదు.

అన్నయ గొప్ప తొక్కటమునవే తగులుకొనెను. గన్నయను పట్టి గిట్టింపవలయునని చేసిన ఎత్తుగడ లన్నియు, నిట్లు అటు మాఁడగునని అన్నయ కలలోఁగూడ అనుకొని యుండలేదు. తన్నిట్టి ఇఱుకటమున కీడ్చిన ఉలిపికట్టెపై అన్నయకు రోసము ముమ్మరమగుచుండెను. కాని ప్రతిక్రియఁ

# 17

అన్నయ సాని సదనమునకేఁగుటకై వెంటనే కయిసేఁత ప్రారంభించెను. తల దువ్వుకొనెను. ఉరిసిన పల్ల వెంట్రుకలను దిద్దుకొనెను. అరప మీసలను మెలివెట్టెను. తెల్లని పట్టు పుట్టంబునుగట్టి పైని అంగీని తొడిగెను. సన్నని తల చీరను కుచ్చెలు వదలి చుట్టుకొనియెను. ఇట్లు ఆ ముదుసలి ఎంతయో ముస్తాబు చేసికొని ఆ ఇంచుబోఁడి పంచలోనికి జనెను.

అతని కప్పుడు గుండె కుదురు లేకయుండెను. జరిగిన దుండగము తలఁపునకువచ్చి అతఁడు మాటిమాటికి బెగడు వడుచుండెను.

లూదుపుల మొగసల మొత్తనే విడిచి అన్నయ రవరవ లోనికేఁగెను. మరల ఏమి కీడు మూఁడునోయని యతఁడు మిడుక సాగెను. కాళ్ళు గజగజలాడెను. కొంత తడవైన పిమ్మట ఆ ముదుసలి ఎట్టులనో డిందుపడి డగ్గుత్తికతో ఇట్లనియెను. "ఓ మగువా, ఆ మడియఁడు గన్నయ నీకేమి మాన్యము లిచ్చినాఁడని అతనిపై అంత మక్కువ కలిగినది? వన్నటుల కెకురించుట నీకు న్యాయమా? వాని ఎక్కువేమి, నా తక్కువేమి?" అని పెక్కురీతుల నిష్ఠురోక్తులు పలికెను.

ఈ మాటలు విని ఆ యాటకత్తియ మారు మాటాడక ఊరకుండెను. మొగమున కోపము ముడివడ

అన్నయ ఆ సంగతినే గ్రుచ్చి గ్రుచ్చి యడుగుటఁ జూచి ఆ బిత్తరి పశ్చాత్తాపమును నటించి, తన కేమియు తెలియఁ దనియు, అందు గన్నయ ప్రమేయ మేమియు లేదనియు, అన్నయకు నమ్మిక కలుగునట్లు చెప్పినది.

ఆ పిమ్మట ఆ యలరుఁబోఁడి అన్నయను దగ్గరి భుజముపై చెయ్యివేసి నిమిరినది. చిక్కని చెక్కిళ్ళను చక్కగ దువ్వినది. మునిముని నవ్వులు నవ్వుచు, ఆ ముదుసలి నామె పెక్కురీతుల అలరింప, అన్నయ యామె సపర్యలకు నుబ్బి తబ్బిబ్బు లయ్యెను.

"అన్నయగారూ ! అయిపోయిన దానికి వగఁజెంది లాభమేమి. నేను మీదాననని నమ్ముఁడు. ఈ దినము గాందారి మాందారి ప్రొద్దు రండు. గన్నయను మీ కైవసముఁ జేయకున్న ఒట్టు" అని మెత్తని మాటలాడి అతని ఉల్లము నుప్పొంగునట్లు చేసి పంపివేసినది.

అద్దమరేయి ముస్తాబై అన్నయ యా వన్నెలాఁడి సదనమునకు పోయెను. ఆ సుందరి అతనినిఁ బిలిచి కూర్చుండఁ బెట్టి మక్కువతో నాతనిని అక్కునఁ జేర్చి లాలించి ధనమును గుంజెను.

ఆ సొగసుకత్తియ అన్నయను జేరి కాళ్లొత్తి మధుర పదార్థముల నిడి, త్రాగుటకు తియ్యని పానీయము నొసంగెను. అందు ఆమె మత్తుమందు కలిపినది. అన్నయ కా సంగతి

తెలియదు. అతఁడా పానీయమును త్రాగి మైమఱచి నిద్ర పోయెను.

తెల్లవాఱినది. కాని అన్నయకు మైమఱపు వదల లేదు. అతనికి మెలఁకువ రాలేదు. అంత నా నునుపుకత్తె గన్నయ తోడుపడ అన్నయను పట్టి ఎత్తుకొనిపోయి వీథినిఁ బోవుచున్న ఒక చెత్తబండిలోఁ బడవైచినది.

ఇట్లగుట చూచిన వారెవ్వరును లేకపోయిరి. వీథు లూడ్చువారు మరికొంత చెత్తను తెచ్చి అతనిపైఁ బోసిరి. చెత్తపోగులు పైఁబడి బరువెక్కిన పిమ్మట అన్నయకు తల దిమ్మువదలి మెలఁకువ వచ్చినది.

తన స్థితి చూచుకొనిన అన్నయకు గుండియ లదురసాగెను. తానచ్చటి కెట్లువచ్చినట్లు ! తన తెలివితేట లేమైపోయినవి. అన్నయ కంతయు గందరగోళముగ నుండెను.

అన్నయకు బ్రతుకుపై రోతపుట్టెను. ఆ యెమ్మెలాఁడి అచ్చిక బుచ్చికములాడి తన నెంత కిక్కురు వెట్టినది ! ఛీ తన జీవితమే నిప్పచ్చరమై పోయినది.

అతని కేమిచేయుటకును తోఁచలేదు. చచ్చిన చావై అట్టె నిలచిపోయెను. ఉరియాడు తన చిత్తము నూరట పెట్టుట యాతని వశముకాలేదు. కదలఁబాఱిన మనస్సును కుదుట బఱచుకొనలేకపోయెను. అన్నయకు మతిచలించినది. అతఁడు వెంగలివలె బిత్తరి చూపులు చూడసాగెను.

మట్టి బండిలో మానిసి నిలవఁబడియుండుట ఎంతయు విడ్డూరముగ నుండెను. మంది గుమికూడి తేరిపార చూడసాగిరి. ఎవ్వరవు నీవనిరి. అచట నేలయుంటివనిరి. అన్నయకు నోరాడలేదు. పెదవి పెగలినది కాదు. అతఁడు మూగవోయి మొద్దువలె నిలువఁబడియుండెను. కొందఱు అతనిని గుఱుతించి అబ్బురపడిరి. అతని కన్నులు తొంగుకొనెను. మొగము జేగుఱించియుండెను. కొందఱు అతనిజూచి జాలిపడిరి. కొందఱు జోకసాగిరి. మరికొందఱు అతనిని చేవాఁడి కాఁడనియుఁ గొంప చెఱుపు కాఁడనియు నాడిపోసిరి. అందఱు నతనినిఁ జులుకనచేసి మాటలాడిరి. ఈ కీడుపాటునకు అన్నయ ఎంత కింకిరుపడినను లాభములేకపోయెను.

ఇంతలో ఆ యూరి మనియకాఁడువచ్చి ఈ వింత మానిసినిఁజూచి, అతఁడు వెంగళియో వెంబరయో నిశ్చయింపలేక, ఎందులకైనను మంచిదని అప్పటి కాతనిఁ దీసికొనిపోయి బయ్యారమునఁ బడవైచెను.

# 18

రఘుదేవరాజు తన వగడమును ముగించుకొని తన కొమరితను చూచుటకై తన పరివారముతో పీఠాపురమున కరుగుదెంచుచు, దుర్గాదేవిని సేవించుటకై బెజవాడలో ఆగెను. ఒక సత్రమున ఆయన బసచేసెను. ఉదయముననే కృష్ణానదిలో స్నానముచేసి, పూలు కుంకుమ పసుపు రవికెలు చీరలు మొదలగు సంభారముల తీసికొని శాంభవీ ఆలయమునకేఁగి యథావిధిగ పూజలు సలిపి తృప్తుఁడై వెలుపలకు రాగనే జగ్గరాజుగారును, తిమ్మాయమ్మారావు గారును ఎదురైరి. వారు రఘుదేవుని జూచి ముఖారకాలము కొయ్యబాఱి మఱునిముసములో తేరుకొని రఘుదేవుని కవుఁగిలించుకొని ఒక్కుమ్మడి దురపిల్లసాగిరి. రఘుదేవుని అబ్బురపాటున కంతు లేకుండెను. అతఁడు ఒకింత తడవు ఊరకుండి, "ఏమి ఆపదవచ్చినదయ్యా!" అని యడిగెను.

జగ్గరాజుగారు అల్లిబిల్లికొనుచున్న ఉమ్మలికమును అదుపునఁబెట్టి, "స్నేహితుడా! ప్రభావతి కనిపించుట లేదు. ఆ బిడ్డ ఏ గడముచ్చు పాలఁబడినదో తెలియకున్నది. నెలరోజులనుండి, రాత్రియనక పగలనక ఆమెకొఱకై వెదకుచున్నాము. ఇంతవఱకును ఆమె ఇక్కడ నెఱుంగ లే పోయితిమి.

"మధురభాషిణికూడ ఆమెను వెదకుటకై ఎటకో పోయినది. ఆమె ఆహారము లేమి మిక్కిలి క్రమక్క మనికితనమున మడసినదని కొంద అనిరి."

"సంగాతకాఁడా! నీ కొమరితను నా చేతఁబెట్టి పోయినావు. ఆబిడ్డను నేము కాపాడలేక పోయినాము. ఇప్పుడు కక్కసపడి ఏమిలాభము! మా బ్రతుకు బండలై పోయినది; ఏ ముఖము పెట్టుకొని మేమిక జీవింపఁగలము. ఈ వార్తను మీకు చెప్పుటకే మేము అరచేతి ప్రాణములం బెట్టుకొని తిరుగాడుచున్నాము. మాకిక బ్రతుకుపై ఆశ లేదు. గంగలో పడి చత్తుము." ఇట్లని వారు పసికూనవలె వెక్కి వెక్కి ఏడ్వసాగిరి.

రఘుదేవునకీవార్త పిడుగుపాటు అయ్యెను. వసల్లడించు మనికితనమున అతఁడు గిజగిజలాడెను. అప్పట్టున రఘుదేవుఁడు మొయిమఱపున కొయ్యబారి కొంతవడికి తెప్పరిల్లెను. అతఁడు కొంచెము ఔఁగ్రాములు తెలిసినవాఁడును. దైవభక్తి కలవాఁడును అగుటవలన కూలిపోక మరల అమ్మవారి సన్నిధిలోనికేగి "తల్లీ, నా బ్రతుకిట్లు బండలు చేసినావేమి! నా భార్యను నీ కొప్పఁజెప్పితినిగదా? అల్లారుముద్దుగ పెంచుకొనుచున్న ఈ ఒక్క గాదిలి కొమరితకూడ నీకు కావలసి వచ్చినదా? తల్లీ! నన్నేమి చేయుమందువు? ఉఱిపోసికొని ఉసుఱుల బాయుమందువా? కత్తితోఁ బొడుచుకొని నా రక్తధారల నీ పాదములు కడుగవలయునా? ఒక్కగాని ఒక్క మేపుట్టువును, బంగారుతల్లిని దిగమింగి నేనెట్లు

బ్రతుకఁగలను?" ఈ విధముగ నాయన పెద్దగ గుండియ పగులునట్లు ప్రార్థించెను.

దేవి మందస్మిత వదనయై యుండెనేగాని పెదవి విప్పి మాటాడలేదు. "తల్లీ నా కేదియో తెన్ను తెల్పినఁ గాని నే నిచటనుండి లేవను. నీవు నీ మౌనమును విడవకున్నచో నా ప్రాణముల నీ కర్పింతును" అని మంకుపట్టు పట్టి ఆ మన్నీఁడు మాతముందు సాగిలపడి లేవలేదు.

ఇది యేమిపిచ్చి! ఈయనను ఊరడించుట ఎట్లు! అన్యాయముగ మహారాజు ఉసురులఁ బాయ సిద్ధమై యున్నాఁడు, అని ఆయన పరిజనమునకు అడలుపుట్టెను. వారిలో కొందఱు ఊరిలోనికి పోయి ఈ యుదంతమును ప్రజల కెఱింగించిరి.

అప్పటికి ఈ ప్రాంతమంతయు కళింగ దేశాధిపతులకు అరిగాపులు అయిన కొండపల్లి రెడ్డపాలనలో నుండెను. అందుచే అచటి స్థానికాధికారి ఈసంగతి తన రెడ్డి ఎకిమీానునకు తెలుపుమని ఇరువురను కిలాతముపై కొండపల్లికు తరిమెను. ఈలోపున బెజవాడ పౌరులు తమ రారాజు ఇట్టి కక్కసమున చిక్కుకొని నాఁడని విని బెగడొందిరి. ఆయూరి మనియకాఁడు మాత్రము పదిమంది పెద్దలను ప్రోగుచేసి ఆలయమునకు వచ్చి ప్రభువుతో నిట్లు విన్నవించెను.

"ప్రభూ! తమరు అరవాయిపడకుఁడు. ఈయూర బ్రాహ్మణవీథిని శ్రీ శంకరస్వామివారున్నారు. వారు భగవతీ

పూజా ధురంధరులు. వారి దర్శనము చేసినచో జగము తల్లి అభీష్ట మేదియో వారు మీకెఱుంగపరుపంగలరు. ప్రభూ! మీరు ప్రాయోపవేశమును మానుఁడు. వారి దర్శనమునకై రండు."

రఘుదేవుఁడు ఈ మాటలు వినెను. అతని మనస్సు డిందుపడెను. మనియకాఁడు చెప్పినట్లు చేయుటకు ఆయవ మయికొని లేచి, దేవిప్రసాదమును గ్రహియించి. ఆకలి తీర్చుకొని స్వామివారి దర్శనమునకై జగ్గరాజు, తిమ్మాయమ్మ గార్లతోను. నిజపరిజనముతోను బయలుదేరెను.

# 19

అన్నయ చెఱవడిన మఱునాఁడు గన్నయ వేకువనే నిద్రలేచి స్నానమాచరించి చలువ మడతల ధరియించి రెడ్డి ప్రభువును దర్శించుటకై బయలుదేరెను.

అతఁడు కాసి పోసి కోక కట్టుకొనెను. బీరపూవుల అంగీని తొడిగికొనెను. తన చుంచు కురులను చక్కఁగ దిద్దుకొనెను. మోమున చుక్కబొట్టును కన్నులకు 'సురమా' పూసికొనెను. రత్నములు తాపిన ఛురిక నొకదానిని బొడ్డున దోపుకొనెను. నీలపు తళుకు చెక్కిన పసిడి ముద్దుటుంగరమును ధరియించి కులుకుతో బయలుదేరినాఁడు. అతని మనస్సు కెలసమున క్రేళ్ళురుకుచుండెను.

ఇట్లు ముస్తాబై గన్నయ గడిలోనికిఁజని దొర ఎదుటబడి తన్ను తా నెరిఁగించుకొని, తా వచ్చినపని చెప్పి ఆ మటుమాయకాఁడు, కయ్యాలమ్రుచ్చు, తనకును తన ఎకిమీనునకును కీడు సేయ తలపడిన వయినమును సవిస్తరముగా ఆయనకు విన్నపించెను.

రెడ్డి మన్నీఁడు కళింగభూపతికి అరిగాపు గాన గన్నయ నెక్కుడుగ మన్ననచేసి అతనికి ఏ కయివడినైనను తోడుగ నుండుటకే మెయివడెను.

ఇంతలో బెజవాడనుండి వార్త వచ్చినది. రఘునాథ ప్రభువు తీర్థయాత్రలు ముగించుకొని బెజవాడను చేరి అటనుండి కొండపల్లి కరుదెంచుచున్నాఁడు.

ఈ వార్త విని దొర తహతహను పొందసాగెను. వెంటనే కోటకు వెల్లవేయించి ద్వారములకు పచ్చని మామిడి యాకుల తోరణములఁ గట్టించెను. శ్రీవారిని గౌరవించుటకు నన్నియు ఆయతము చేసెను.

డప్పులు, బూరలు, సన్నాయిలు, పెద్దబాకాలు, డోళ్లు, రుంజలు, రండోళ్ళు మొదలగు వాద్యములతో పాలెగాండ్రు వెంటరా రెడ్డిదొర ఎదురువోయి; రఘుదేవుని నడిదారిలో కలిసికొని సగౌరవముగఁ గొనివచ్చి కోటలో ప్రవేశపెట్టెను.

గన్నయ తన మన్నియను కలిసికొని యాతని పాదములపైఁబడి ప్రభావతికి సంభవించిన ఆపదనింగూర్చి చెప్పి, తానామెను కనుఁగొనుటకై పడిన పాట్లు ఇన్ని అన్నికావని చెప్పి కన్నుల నీరుపెట్టెను.

ఆ పిమ్మట అన్నయ తనకు కీడొనరింపవలయునని పన్నిన పన్నాగములఁ గూర్చియు ఆతని అడిగొండు తనమును గూర్చియు మన్ననతో ప్రభువునకు విన్నవించెను. తుట్టతుదకు తాను ఆ కుచ్ఛితుని పీచమణఁగిన వయినమునుగూడ చిప్పగఁ జెప్పెను.

"ప్రభూ! మధురభాషిణి. ప్రభావతి ఇక్కువ నెఱుంగుటకై పడరాని పాట్లు పడినది. ఆమె లెక్కలేనన్ని ఇడుములఁ గుడిచినది. ఇప్పటికామె యిక్కట్టులనుండి గట్టెక్కినట్లు నిన్ననే వార్త వచ్చినది. ఆమె ఎప్పటికప్పుడు తన ఉనికినిగూర్చియు చెయిదములం గూర్చియు తెలియఁ జేయుచునే యున్నది. మా యిద్దరి మధ్యను అనుదినము వేగు నడచుచునే యున్నది. ఆమె ప్రభావతి ఇక్కువ నెఱింగినదని నిన్ననే కమ్మ వచ్చినది." ఈ తెఱగున గన్నయ సంగతి అంతయు తన ఱేఁడున కెఱింగించెను.

రఘుదేవుఁడు ఈ యుదంతమును విని సంతోషాతిశయమున పక్కపై కొఱిగి కన్నులుమూసి దేవిని ప్రార్థించెను. ఆ స్థితినిజూచి గన్నయాదులు కక్కసపడిరి. దుఃఖపు పొంగు రాగా ఱేఁడు అరసావు బడెనని వారనుకొనిరి. కొంచెముసేపు గందరగోళ మయ్యెను. తరువాత రఘుదేవుఁడు కన్నులు తెఱచి తనను చుట్టుకొనియున్న వారితో వెఱఁగు పడవలదని వారింప, వారును శాంతించిరి.

మధురభాషిణి ప్రభావతికై వాడవాడలంబడి వెదకుచున్నదని మనకు తెలియునుగాని ఆమెను కనుగొనినట్లు తెలియదు. ఇది వింతగనే యున్నది. అది ఎట్లు సంభవించినదో తెలిసికొందము. రఘుదేవుఁడు వచ్చుటకు మూనాళ్ళ ముందు ఈ ముచ్చట జరిగెను.

## 20

ఆదినమున ఆకసమున మబ్బులు దట్టముగ వ్యాపించినవి. కటిక చీఁకటి క్రమ్ముకొనినది. పెనుగాలియొకండు ప్రళయముగ వీవసాగినది. ఆ చీఁకటిలో తాటిచెట్ల తలలు విరియబోఁసికొనిన దయ్యములైనవి. పాదపములు పెనుభూతము లైనవి.

దయ్యములు కామ రూపులు గాన అవి కుక్కల వలెను, గూబలవలెను అగుపడగలవని జనులు నమ్మిరి. కుక్క మొఱఁగినను గుడ్లగూబ కూఁత చెవిని బడినను ప్రజలు కక్కటిలిపోవుచుండిరి. ఇట్టి భయముతో ఊరంతయు ఉడికిల్లుచుండెను.

ఆ పెనుచీఁకటిలో మధురభాషిణి ఒంటరిగా కొండ అవతల దరినున్న పాడుపడిన వాడలోనికి జని పాట పాడుచు తిరుగుచుండెను. ఆ పాటవిని పిచ్చిది వచ్చుచున్నదని అంతఁదనుక మేల్కొనియున్న వారు తెలిసికొని పక్కలలో ముడుచుకొని "మూఁడంకె" లగుచుండిరి.

ఆ వాడలో ఒక మేడగలదు. అందు నల్గురు మనుష్యులు విడిసియుండిరి. తమ రహస్యములు ఇతరు లెఱుంగకుండుటకై వారు అట్టి గృహమున నిల్కడ నేర్పఱచుకొనిరి.

వారు ఆ యద్దమరేయి ఆ మేడయందొక గదిలో కూర్చుండి ఏదియో రహస్యాలోచనము చేయుచుండిరి. ఆ వెఱ్ఱిదాని కేకలు, పాటలు వారప్పట్టున విని భయముతో గజగజ వణకిపోయిరి.

అంత కంతకు ఆ వెంగలి పాట దగ్గరిలసాగెను. అప్పుడొక విచిత్రము జరిగినది. ఆమె ఒక చరణమును పాడగనే పాడువడిన మేడలోని వారొకరు ఆ పాట నందుకొని రెండవ చరణములు పాడిరి.

మధురభాషిణి అది విన్నది. ఆమెకు గగుర్పాటు కలిగినది. తన తపస్సు ఫలించినట్లు, దైవ సాక్షాత్కారమైనట్లు ఆమె పరవశయై మరల మొదటి చరణమును పాడెను. మరియొకసారి రెండవచరణము ఆ శిథిల గృహోపరి భాగమునుండి వినవచ్చినది.

మధురభాషిణి ఎగిరి గంతువైచినది. సంతసము ఒక శక్తి ప్రవాహమై ఆమె శరీరమునందలి నర నరమునకు ప్రాకినది. ఆమె యొక్క శక్తి స్వరూపిణి అయినది. ఎక్కడ లేని బలము వచ్చినది.

ఒక్క గంతులో ఆమె ఆ పాడువడిన మేడవద్దకు వచ్చి వాకిలి తలుపు నొక తన్ను తన్నినది. చీకి చెడియున్న గడియలు ఊడి పడినవి. ఆమె నిక్కుచు నీల్గుచు, తక్కుచు తారుచు ఆ భయంకర గృహమున ప్రవేశించి పిచ్చి కేకలు వేయసాగినది.

ఆమె అటుతిరిగి, యిటుతిరిగి అందుండిన ఒక విశాలమైన గదిలోనికిఁబోయి భయంకరమైన పిశాచ నృత్యమొకటి చేసినది.

అరచేత ప్రాణము లుంచుకొని బిక్కుబిక్కు మనుచున్న ఆ దుష్ట చతుష్టయము ఆ నాట్యమునుజూచి తమ నామె కబళించుటకే వచ్చినదని నమ్మి కెవ్వున కేకవెట్టి ప్రాణముల దక్కించుకొనుటకు తలకొక దిక్కై పరువెత్తిరి.

అటుపై మధురభాషిణి తన మొగముపై రచియించుకొనిన నల్ల మచ్చలను తుడిచివైచుకొని శాంతమూర్తియై గదులెల్ల వెదకి అందొక దానియందు ముడుఁచుకొని కూర్చుండిన ప్రభావతిని కనుగొని "తల్లీ! భయపడకుము. నేనే మధురభాషిణిని. నా వికృతాకారమునుజూచి వేఁటగొందకుము" అని మధురముగా పలికి ఆ బిడ్డను చేతులలోనికి తీసికొని ముద్దాడి బుజ్జగించినది. ఆతరువాత వారిరువురును ఒకింత తడవు గుసగుస లాడిరి.

ఇరువది నిముసముల తదుపరి ఇరువురు పురుషులు ఆ భయంకర గృహామును వదలి దుర్గగుడివైపునకు నడచివెళ్ళిరి.

# 21

మధురభాషిణి ప్రభావతిని ఆపదనుండి రక్షించి, ఆ సంగతి వెంటనే గన్నయ కెఱుక పఱచెను.

అటుపిమ్మట వారిద్దఱును మాఱు వేసముల బెజవాడనే దాగియుండిరి. అన్నయ తమ కెట్టి కీడుపాటు ఒనరించునోయని వారు అరవాయిపడి బెగడొందియుండిరి.

ఇంతలో గన్నయ కొండపల్లినుండి తగిన పరివారమును, బండ్లను పంపి రఘుదేవరాజు తన అనుగుడమ్ము ముగించుకొని కొండపల్లియకు చనుదెంచినట్లు మధురభాషిణికి తెలియఁబరచెను. వెంటనే వారు తమ వెఱగుపాటును విడిచి కొండపల్లికి పయనమైరి. గన్నయ వారిని మార్గమధ్యముననే కలిసెను.

తండ్రిని చూడవలయునని ప్రభావతి పురపుర లాడెను. ఆ యాస నామెను ఉత్తల పెట్టెను. ఆమె కుసిగుంపులుపడి అంక పొంకాలమీఁద పయినముచేసి కొండపల్లియకు చేరుకొనెను.

బాబును చూచినంతనే ప్రభావతికి ఉమ్మలికము పెల్లుబ్బుగ వచ్చెను. ఆబిడ్డ తండ్రిని కవుఁగలించుకొని యిట్లనియెను.

"తండ్రీ! నేను నిన్ను తిరిగి చూతునని కలలో నైన అనుకొనియుండలేదు. ఆ దేవి కృపవలన చూడఁగలిగినాను. అన్నయ చేసిన కుతంత్రము లిన్ని యన్ని కాదు. అతఁడు దుండగీండ్ర సాయమున నన్ను తన వశము చేసికొనవలయునని ఎంతయో ప్రయత్నించినాఁడు. నన్ను ఎత్తుకపోయిన దొంగలను, మధురభాషిణికంటె ముందుగ అతఁడే కనిపెట్టినాఁడు. అతఁడు ఆ యుఱువలకు పెల్లుగ ధనమిచ్చి నన్ను కొనినాడు. ఆ దినమునఁ గాంధారి మాందాస్ప్రొద్దు నన్ను కటకమునకు తఱలించుకొనిపోవుటకు బేరములు సాగుచుండెను. ఇంతలో దేవి దయవలన మధురభాషిణి నన్ను కనుఁగొనినది. ఆ దొంగలు ఆమె వికృతరూపమునుజూచి పిశాచమని అనుకొని భయపడి ఊపనిబాడిరి. ఇంకొక గడియ ఆలస్యమైనచో నేను అన్నయ పాలఁబడి యుండెడిదానను. నన్ను ఈమె రక్షించినది." ఈ తెఱఁగున ఆమె జరిగిన కథ యంతయు పూసగ్రుచ్చినట్లు చెప్పెను.

రఘుదేవుఁడు జరిగినదానికి ఒకింతతడవు కుతికిలఁబడి వెంటనే తెప్పరిల్లి కుదుటపడెను. కృతజ్ఞతతో దేవికి ప్రణమిల్లెను. తదుపరి తన బిడ్డను సందిటఁ జేర్చుకొని హర్షముతో ముద్దాడెను.

గన్నయ ఆరాత్రి అన్నయను అట్లు వంచింపకపోయినచో ప్రభావతి తఱలిపోయియుండెడిది. అన్నయ కొండపల్లియనుండి ఒకవైపున గన్నయతో చివ్వ సాధించుచునే ప్రభావతిని తఱలించుటకు ఆయత్తము లొనరించుచుండెను.

గన్నయ బ్రతికి యున్నంతవఱకు తన ఆటలు సాగవని గ్రహించినవాఁడు కావున అన్నయ ఏ కయివడినైనను గన్నయను కొండపల్లినే మట్టువెట్టి పోనలయునని గట్టిపట్టు బట్టెను. కాని దైవము సరిగ చూడఁబట్టి ఆయన ప్రయత్నములన్నియు ఈటువోయి చివర కతఁడే పట్టునడియెను.

అటుపిమ్మట రఘుదేవుఁడు, మధురభాషిణి ప్రభావతి గన్నయాదులు ఆ గడముననే కొన్నిదినములు సుఖముగ కాలము గడిపిరి. ఇంతలో కళింగపురమునుండి వార్తలువచ్చి వారందరును కొంపల్లియను విడచి హుటాహుటిని కళింగపురమునకు వెడలిపోవలసివచ్చినది.

# 22

కటకమునుండి వార్తాహారులు వచ్చినారని విని నంతనే రఘుదేవుని గుండె లదరఁజొచ్చినవి. ఎట్టి చెట్టిదపు మాట చెవినిబడునోయని అతఁ డారాట పడసాగెను. ఏదియో ఆపళి వచ్చినదనియే అతఁడు మిక్కిలి అక్కిలిపడెను. వీరభద్ర గజపతి తన రాజ్యమును ఆక్రమించియుండనోపు నని తలఁపు నకు వచ్చి ఆతఁడు గజిబిజి పడెను.

అక్కటతన రఘుదేవుఁడు వార్తలు తెచ్చిన వారిని తన ఎదుటకు పిలిచి యిట్లనియెను. 'ఓయీ మీరు తెచ్చిన వార్త శుభమైనను అశుభమైనను నా అనుజ్ఞ అగు వరకును ఎవ్వరికిని చెప్ప వలదు. నేనుగూడ వినను. ఇచ్చట నొక వివాహ కార్యము జరుగవలసి యున్నది. అది పూర్తియగు వరకు మీ రేమియు బయటపెట్టక ఊరకుండుడు.”

ఈ మాటలు [illegible] వారిని పంపివేసి ఆ మహారాజు గన్నయను తన సన్నిధికి రమ్మని ఆతనితో నిట్లు చెప్పెను. “గన్నయా! నేను ముదుసలినై యున్నాను. నేనిఁక రాజ్యభార మును వహింపలేను. గజపతి కళింగరాజ్యమును కబళించి యున్నాఁడని నా కనుమానము కలుగుచున్నది. అదే నిజ మైనచో ప్రభావతికి అన్యాయము జరిగినదన్నమాట. ఇక ఆ విషయ మంతయు నీవే చూచుకొనుము!”

గన్నయ ఈ మాటలు విని చిఱునగవు నవ్వి తల యూపి, అటుల ఎప్పటికిని జరిగియుండ దన్నట్లు చూపులతో తెలియఁజేసెను.

రఘుదేవుఁడు మఱల నిట్లనియెను. "గన్నయా! మరియొక సంగతి" అని కొంచె మాగెను. మధురభాషిణిని గన్నయకిచ్చి పెండిలిసేయవలయునని అతఁడు ఆలోచించు చుండెను. వారిద్దఱును ఒకరి నొకరు ప్రేమించుకొనుచున్న ట్లును, ఆ విషయమున తనఆజ్ఞకై వారు వేచియున్నట్లును అతని మనస్సునకు తోఁచినది. అక్కతన అతఁ డిట్లనియెను.

"గన్నయా! నీవు ఈ మధురభాషిణిని వెంటనే పెండ్లాడవలయును."

ఈ యనునయ వాక్యములనువిని మధురభాషిణి సిగ్గుచే తలవంచుకొనెను. ఆమె చాలకాలమునుండి గన్నయను ప్రేమించుచుండెను.

గన్నయ మాటాడక మౌనముగనుండుట చూచి రాజు విస్మయమును పొంది, సాభిప్రాయముగ గన్నయవంక చూచెను.

గన్నయ లోలోన సంతసపడుచుండెను గాని పైకి మాత్రము ఈ వివాహము ఇష్టములేనివానివలె ముఖముపెట్టి "ప్రభూ! అపని నావలన కాదు" అనెను.

రఘుదేవుఁడు నివ్వెరపడి 'ఏమి' యని అడిగెను. గన్నఁడు, "ప్రభూ ! మధురభాషిణి ఇట్లగుపడుచున్నది కాని నిజమునకు ఆమె పిచ్చిది. మనుష్యులను కొఱికి తినునఁట ! నాకామె వలదు" అని చెప్పెను.

ఈ మాటలు విని మధురభాషిణి విరుగఁబడి నవ్వినది. ప్రభువు కూడ ఈ గన్నయ అడ్డుగట్టుమాటల అంతర్యము తెలిసికొని గోరడము అనుచున్నాఁడని గ్రహించి నవ్వుకొనెను.

కొండపల్లి కోటలోనే వారిద్దఱకును వివాహము వైభవముగ జరిగినది. అటుపిమ్మట రఘుదేవుఁడు వార్తాహరులను పిలచి "ఏమి సంగతి ? మీరు తెచ్చిన వార్తలేమి?" అని యడిగెను.

# 23

కళింగపురము నుండి వచ్చిన వారు జేని మోడ్చిల చేతులు మోడ్చి నిలువఁబడి ఇట్లనిరి.

"ప్రభూ! మన దేశమున పంట కాపు లందరు సుఖముగ నున్నారు. జగము తల్లి దయవలన ఎవ్వరికిగాని ఎట్టి కొదువయును లేదు."

"వీరభద్ర గజపతి ఏదియో దుండగము చేసి యుండునని మీరు అపోహ పడినారు. అట్టి అగడమ్ము ఏమియు జరుగలేదు."

"గజపతి ప్రభువు మీ అగచాటుల గూర్చి విని జాలిని పొంది మనస్సును మార్చుకొని మీ సంగడమును అపేక్షించుచున్నాఁడు. మీరు లేని సమయమున అతఁడు మనకెన్నియో తెన్నుల తోడుపడగ నున్నాఁడు." ఈ మాటలువిని రఘుదేవరాజు అబ్బురపడెను.

గజపతి మంచితనమును గూర్చి వారింకను ఎన్నియో విషయములను దెల్పిరి. గజపతి మధురభాషిణిపై మమతను మఱచి తన చిన్నతనపు చెయిదములకును తుందుడుకు తనమునకును కిఁకిరిపడినాఁడని వారు మహారాజున కెఱింగించిరి.

వీరభద్రుఁడు చిన్నవాఁడు. ఏదియో తెలిసి తెలియని స్థితిలో ముమ్మరమైన మోహమున, ఇఱుకటముతఁబడి రఘుదేవునితో అర్వైరము పెట్టుకొనెనేగాని ఆ కాక తగ్గిన తరువాత, అతఁడు రఘుదేవుని యోగ్యతను గూర్చి తలపు చేసి, తండ్రివంటి వృద్ధుని ఇడుముల గుడిపినందులకు సిగ్గిలి తన్నుతా నిందించుకొని వగఁజెందినాఁడని కూడ ఆ యాగంతకులు వాకుృచ్చిరి.

ఈమాటలు వినినంత రఘుదేవునకు కడుపు నిండినట్లయినది. అతని సంతసము తోల్రకాడెను. వెంటనే రఘుదేవుఁడు రాణువతో పయనమై కతిపయ దినంబులకు కళింగ పత్తనము చేరెను.

పట్టణమంతయు సుమనోజ్ఞముగ అలంకరింపఁబడి యుండెను. పచ్చని తోరణములతో ఊరంతయు కళకళలాడుచుండెను. గజపతియే స్వయముగ రఘుదేవునకు ఎదురు వచ్చి నమస్కరించి, స్వాగతమిచ్చి పట్టనమున ప్రవేశపెట్టెను. డప్పులు వాయించిరి. బూరల, కొమ్ముల నూదిరి. శంఖముల మ్రోఁత దిక్కుల పిక్కటిల్లెను.

రఘుదేవుఁడు తన గద్దెపై సుఖాసీనుఁడై యున్న పిదప, గజపతి రఘుదేవుని చెంతఁజేరి అంజలిచేసి "తండ్రీ! కుదిచి కూర్చుండలేక నీతో వైరము పెట్టుకొంటిని. మిమ్ముల ఇక్కట్టుల పాలుచేసినాను. తెల్విలేమి నేఁజేసిన పనికిపుడు అలమట పడుచున్నాను. నన్ను క్షమింపుడు. నేను మీ బిడ్డ

వంటి వాడను." ఇట్లేటింగున నాతఁడు ప్రియ వచనములు పలుకగనే, రఘుదేవుని కతనిపై ప్రేమువి కలిగినది. ఆతని కన్నులు చెమ్మగిలినవి. రఘుదేవుఁడు వీరభద్రుని కవుఁగలించుకొనియెను,

ఆ తరువాత గజపతి బ్రతికియున్నంత వఱకు, వారిద్దఱమధ్య ఆనాఁడేర్పడిన సంగడ మెప్పటికును సడలలేదు.

# 24

రఘుదేవుఁడు కళింగపురమున కేగిన పదునైదు దినములకు, జగ్గరాజుగారును శ్రీమన్నయమ్మరావు గారును వచ్చిరి. వారూరక రాక శుభవార్త నొకండు మూటగట్టుకొని వచ్చిరి.

పెద్దాపురమునకు జగపతులను వారు పాలకులు. అప్పటికచట యువరాజులై యున్న జగన్నాథ జగపతులవారికి ప్రభావతిని ఇమ్మని అడుగుటకు వారు అరుగుదెంచిరి. జగపతులీ సంబంధమున కిదివఱకే మెయివడిరఁట.

అంతకంటె కావలసినదేమున్నదని రఘుదేవుఁడు ఈ సంబంధమునకు ఒడంబడియెను. ఒక శుభ లగ్నమున ఆ వివాహము అతి వైభవముగ జరిగినది. గజపతి ఆ సమయమున పెండ్లి పెత్తనదారై కోటయంతయు పట్టాడెను. అతని రాణియు జనానాతో తీవిగ నిలచి వినుకన్నియయు జరిపి ఎంతయో సందడి చేసినది.

ప్రభావతిని అత్తవారింటికంపు సమయము వచ్చెను. రఘుదేవుని హృదయమున ఆనందము, దుఃఖము పెనఁగొని ఉబ్బును కలిగించినవి.

తిమ్మయమ్మరావు గారును జగ్గరాజు గారును తండ్రికంటె ఎక్కువగ పెకపెకలాడిపోయిరి. వారు ఆబిడ్డను ఆలింగనము చేసికొని "తల్లీ! మేము నిన్ను పెంచిన తల్లిదండ్రులము. మేము నిన్ను వదలి ఉండలేమమ్మా. ఆనాఁడు నిన్ను దొంగలు ఎత్తుక పోయినారు. ఈ నాఁడు దొర ఎత్తుక పోవుచున్నాఁడు. ఆనాఁడు నీతో రాలేకపోయినాము. కాని ఈనాఁడు నిన్ను విడిచి బ్రతుకలేము తల్లీ" అని ఒకింత సేపు విలవిలలాడిరి. మధురభాషిణికూడ ప్రభావతిని సందిటఁజేర్చి ముద్దాడి "తల్లీ! సుఖముగా కాఁపురము చేయుమమ్మా" అని దీవించి పంపెను.

రఘుదేవరాజు గన్నయ సాయముతో కళింగ రాజ్యమును పాలించెను. ఆయనపేరిట పెక్కు పట్టణములు వెలసినవి. ఆంధ్రదేశమున రఘుదేవపురము లెన్నియో కలవు.

ఇఁక అన్నయ సంగతి మాత్రము చెప్పవలసి యున్నది. అతఁడు దుష్టుఁడు. దుష్టుని దూరముగ నుంచుట మంచిది యని అందఱకును తోఁచినది. అందుచే నాతఁడు కొండపల్లియందే ఉండవలయునని నిశ్చయింపఁబడెను.

అన్నయ భార్యయు, తల్లియు కొమరుఁడును కటకమునుండి కొండపల్లికి కొనిపోఁబడిరి. వారు అచటనే ఉండు ఏర్పాటు జరిగినది. అతఁడుండుటకై కోట వెలుపల భవనమొకటి ఏర్పాటుచేయబడెను. ఆయనకు కావలసిన సంబారములన్నియు కోటనుండియే వచ్చును. అన్నయ కేదియు కొఱవ లేకుండెను. కాని అతఁడు ఊరుదాటి వెడలుటకు

మాత్రము అనుజ్ఞ లేకుండెను. ఆయన బ్రతికి యున్నంత వఱకు అట్టి కట్టడిలో నుండవలసి వచ్చెను.

అన్నయ సంతతివారు కూడ కొండపల్లిలో చాల కాలముండెడివారట. ఇప్పటికిని వారు నివసించిన స్థలమున అనుపుల్లుపడిన మేడయొకటి కలదు. ఆ స్థలమును అన్నయ తిప్పయని పిలుతురు.

గన్నయకు ఎంతయో తోడుపడిన చంద్రముఖికి మాన్యము లియ్యఁబడెను. గన్నయ ఎడల తనకున్న కృతజ్ఞతను తెలుపుటకామె తన పేరు గన్నమయని మార్చుకొనెను. ఆ కుటుంబమువారు ఇప్పటికిని కొండపల్లిలో నున్నారు. వారియింట పుట్టిన ఆఁడుబిడ్డలకు గున్నమ, గన్నమ, కన్నను, గన్నయగారి గున్నను అనుపేర్లను ఉంచుదురు.

అన్నయ, గన్నయలకథ కొండపల్లిలో ప్రతి ఇంటను చెప్పుకొందురు.

# "క్షీరవర్ధని"

ఏం వదినా, ఖులాసాగా వున్నావా ?

ఏమి ఖులాసా, పిల్లవాడు ఏమీ బాగుండలేదు వదినా. ఆరు నెలలు వెళ్ళినా, వళ్లు చేయలేదు. ఎప్పుడూ ఏదో రోగాలే! ఏం చేసేది వదినా ?

పోతపాలు పోస్తున్నావా ఏమిటి ఖర్మం ?

పోతపాలేనమ్మ. ఏంజేసేది ? నాదగ్గర పాలు లేవుగా వదినా !

ఇంకేం ! పోతపాలు పోస్తున్నావు కాబట్టే పిల్లవాడు చిగ నాసిల్లి పోతున్నాడు. పోడా ఏమిటి! బిడ్డలకు తల్లిపాలే బలం వదినా, పోతపాలు పిల్లలకు ఎప్పుడూ జ్వరమూ, అజీర్ణమూ, ఏదో ఒకటి వస్తూ ఉంటుంది. తల్లిపాలు తాగినవాడు దుక్కలాగుంటాడు.

నిజమే వదినా, ఆసంగతి నాకూ తెలుసు ! ఒక్క చుక్క ఆయినా లేంది నేను ఏంజేసేదమ్మా !

(బుగ్గమీద పొడిచి) ఏం తెలియ్యాలో తెలియదటమ్మా ! అందరికీ తెలిసిన సంగతి నీకు తెలియకపోవట మేమిఖర్మమూ అంటూ ! 'క్షీరవర్ధని' అనే మందు పుచ్చుకొంటే తల్లికి నిక్షేపంలా పాలు పడతవి! మా కోడలుకు ఇప్పించామూగా. ఆ చిన్న వెధవ వళ్లుచేసి దుక్కలాగున్నాడు.

ఆట్లాగా వదినా ! ఎక్కడ దొరుకుతుంది ఆ మందు !

ప్రతి మందుల షాపులో దొరుకుతుంది. లేకపోతే ఆయుర్వేద నిలయం, పోష్టుబాక్సు 32. విజయవాడ. అని వ్రాస్తే మూడోనాటికల్లా వస్తుంది. వస్తాను, వదినా, మంచి ఆయుర్వేదమందులన్నీ దొరుకుతయమ్మా అక్కడ.

థాంక్సు వదినా, థాంక్సు.

# ఆంధ్ర బ్యాంకు లిమిటెడ్

## ప్రధాన కార్యాలయము — మచిలీపట్టణము

స్థాపితం : 1923

---

చెల్లించబడిన మూలధనము మరియు రిజర్వులు. రు. 37,41,000
అమలునందున్న వ్యాపారమొత్తము రు 7 కోట్లు మించినది.

మద్రాసులో శాఖలు: 1) 322-28 లింగిచెట్టి వీధి, మద్రాసు 1.
2) 77 కచేరి వీధి, మైలాపూరు, మద్రాసు 4.
3) 87 త్యాగరాయరోడ్డు, త్యాగరాయనగర్ మద్రాసు 17

కర్నూలు ఆఫీసులు: 1) 1/9 మెయిన్ బజారు, పేట
2) లెజిస్లేచరు సెక్రటేరియట్ భవనము
(ఈ పై ఆఫీసులు అసెంబ్లీ సెషన్సు జరుగుచున్నంతకాలము తెరచియుంచబడును)

మరియు ఆంధ్రరాష్ట్రమందంతటా, బళ్ళారి పట్టణములలోను బ్రాంచీలు, సబ్ ఆఫీసులు కలవు

లండన్ ఏజంట్లు:

బార్క్లేస్ బ్యాంకు లిమిటెడ్,
చీఫ్ ఫారిన్ బ్రాంచి,
168 ఫెన్ చర్చి స్ట్రీటు, లండన్ ఇ. సి. 3

సేవింగ్సు డిపాజిట్లు నూటికి సంవత్సరమునకు రు. 2–8–0 వడ్డీ చొ॥ నెలవారి నిలవలమీదను, కరెంటు డిపాజిట్లు నూటికి సంవత్సరమునకు రు. 0–8–0 వడ్డీ చొ॥ రోజువారి నిలువలమీదను అంగీకరించబడును.

ఫిక్సెడు డిపాజిట్లు ఆకర్షణీయమైన వడ్డీరేట్లకు 3, 6, 9, 12, 24 మాసములకు అంగీకరించబడును.

మూడు సంవత్సరముల క్యాషు సర్టిఫికెట్లు 100 కి రు. 89/–చొ॥ యివ్వబడును. బంగారు వస్తువులమీద, గవర్నమెంటుపత్రముల మీద బులియను మరియు తదితర ఆహార దినుసులమీద అప్పులు యివ్వబడును.

